# గులాబి నవ్వింది

'కొలకలూరి'






ఉమా పబ్లిషర్సు
విజయవాడ-1

# అంకితం

అమ్మకూ

నాన్నకూ

# సుమనస్సుమాంజలి

గురుదేవులు

కరుణశ్రీ శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారి[illegible]

దయార్ద్ర హృదయులు

శ్రీ అలపర్తి సత్యనారాయణ చౌదరిగారికీ

కృతజ్ఞత

శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారికీ

శ్రీ నార్ల వేంకటేశ్వరరావు గారికీ

1 సమాగమం

ఆంధ్రప్రభ వారపత్రిక 25-12-59

2 మంచు శిఖరం

ప్రథమ బహుమతి

ఆంధ్ర యూనివర్సిటీ-ఆంధ్రభాషా సమితి పోటీలో '57-'58

భారతి ఏప్రెల్ 58

3 రాగరేఖలు

ఆంధ్రప్రభ వారపత్రిక 21-1-59

4 నిశిదినీ శంఖారావం

ప్రథమ బహుమతి

ఆంధ్ర యూనివర్సిటీ-ఆంధ్రభాషా సమితి పోటీలో '58-'59

ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1959-'60

5 తేలుకుట్టిన పాము

భారతి ఆగస్టు '58

6 గులాబి నవ్వింది

ఆంధ్రప్రభ వారపత్రిక 7-5-58

# ఋతు హేల

ప్రేమ నవరత్నాల కల్లోలిని యౌవనం పుష్యరాగ శైవలిని వయస్సు వరాల పుణ్యతీర్థోర్మిలిని

యువతి ఆర్ద్రహృది వారిధి యువకుని ఉత్తేజం ఉన్మిషితాకాశం దూరదూరాన నింగి నీళుల కలయిక కవితలో కదలిక కలిగించింది

“సమాగమం” సంపెంగ నిడువైన లేతమామిడి చిగురులు భుజింపగా గొంతుక కషాయితమైన కోకిల కొసరు కూతల వసంతం

జీవితం ఆశ నిరాశల ఉయ్యాల ఆశలో ఆనందం వెలుగు నిరాశలో బాధ చీకటి

కరాళ కాళరాత్రిలో కరివాత్ముడు కంటకావృతుడై గావుకేక పెట్టాడు గాలిలో ఆందోళన భావనలో పొంగింది

‘నిశీథిని శంఖారావం’ శిరీషం, ఎండమావుల వడగాడ్పుల్లో పరుగులిడే కురంగాల గ్రీష్మం

కోపం కొండనాగుల వరద ఆనకట్ట పంటపొలాల వెలుగు అడ్డునేని ప్రవాహం అనర్థకాల హేతువు

గిరిసమ్రాట్టుహిమాలయం, ధావళ్యమూ, నైర్మల్యమూ పావిత్ర్యమూ, చల్లదనమూ వలచిన మంచిమనిషివంచితుడై కుంచిత పరిధిలో నర్తైపోయిన జాలిఘటన ఊహనుమీటింది

'మంచు శిఖరం విరజాజి వెండిధారల వానలు కురి పిరచు మేఘాలు చూచి పులకించే నాట్య మయూరాల వర్ష

స్త్రీ సంధ్య తొలిసంజ మలిసంజ వ్యష్టిలో సమ దృష్టి సృష్టి రాగసమష్టి నారీమూర్తిలో ప్రపంచ పరమూర్ధ స్ఫూర్తి

రత్న కిరణాలు దశదిశలూ విశృంఖల విహంగాలు స్త్రీ హృదయ కాంతులు ప్రసారితాలయిన తోటల్లో పూచిన పూలు మేల్బంతులు, మమతామయాలు ఆలోచనలుకొలు సాగింది

'రాగరేఖలు' రెల్లుపూలు నవ్వులో తెల్లని వెన్నెల వాకలు కదిలించు రాయంచల శరత్తు

కాంక్ష విద్యుత్తు అనాలోచిత సంభావన ఆపద సమ్యక్ చింతిన విజయం

అనాదృత యువ విపంచిక తీగలు మూగరాగాలు ప్రమోగాయి స్పందనం ద్వైవిధ్య సమ్మిశ్రితం పర్యవసానం త్రిశంకు స్వర్గం మనస్సు పరవళ్ళు త్రొక్కింది

'తేలు కుట్టిన పాము' నల్లకల్వ అందాలు చిందించే పావురాల హేమంతం

ఉత్సాహం సెలయేరు పర్వతసానువుల్లో పరుగు గంభీరం సమతల ప్రదేశంలో సరస నిదానం పూలు స్ఫీటి ఫలితాలు

మధురామృత మధుహాసితం వేకువ పోటీ శక్తికి గీటురాయి సంతోషాన్ని అనుభవిస్తుంది నవజీవన దిగంత యాత్రలో దృగంత స్విన్న స్నిగ్ధాన్మత హృదయం ముచ్చట పడింది

‘గులాబి నవ్వింది మల్లెమొగ్గ ఆదికవి హృదిలో మెదిలిన క్రౌంచ మిధునాల శిశిరం

1-1-60 కొ ల క లూ రి

# సమాగమం

'టైప్ చేయబడును

అది బోర్డు

శ్యాం ఫైల్‌తో పాటు లోపలికి నడిచాడు

వాకిలి దగ్గరగా టేబిల్ టేబిల్ పక్కగా క్రొత్త రెమింగ్‌టన్ టైప్‌మిషన్ మిషన్ ఎదురుగా కుర్చీ కుర్చీలో యువతి

యువతి చేయవలసిన పనిలేక నిర్లిప్తంగా కూర్చుని వుంది.

ఆకుపచ్చని సిల్కుచీర ఎర్రని జార్జెట్ రవిక

కోల కోలగా కోమలముఖం పచ్చపచ్చగా ఎర్రని పెదాలు సన్నని కళ్ళు నున్నని చెక్కిళ్ళు నొక్కుల జుట్టు నిడువాలు జడ సన్నజాజి మాల

తెల్లని నుదురు నుదుటిమీద ముంగురులు పాపిట క్రింద కుంకుమ

ఎర్రని చిన్న గది

గదిలో ఆమే, అతనూ, ఆమె టైపు మిషనూ, అతని ఫైలూ

ఆమె వీణ తీగె కంటే, మల్లెతీవె కంటే సన్నగా ప్రశ్నించింది

'ఏమైనా టైపు చేయాలా?'

శ్యాం, ఆమె పెదవులు సున్నితంగా పొందే కదలికా, ముఖంలో కలిగే చిన్ని చిన్ని సంకోచవ్యాకోచాలూ చూస్తున్నాడు

ఆ మాటలో అతను స్వర్గ సంగీతం విన్నాడు

అతను ఏమీ సమాధానం చెప్పలేదు

యువతి మళ్ళీ ప్రశ్నించింది మునుపటికంటె కొంచెం పెద్దగా, మృదువుగా, స్ఫుటంగా, తియ్యగా,

'టైప్ చెయ్యాలా?'

సెలయేటి తరగల గలగలలు, కోకిల ప్రసన్నగానం మలయ మారుతం మధుర రవళి శ్యాం విన్నాడు

వెంటనే కోలుకున్నాడు

'అవును చేయాలి'

'ఇవ్వండి!'

చేయి చాపింది

లేత చేయి సుకుమారమైన చేయి అతను బంగారు తీగెలు చూశాడు

'ఇవ్వండి'

ఫైలులో కాగితాలు తీస్తున్నాడు

తిన్నగా కోటేరులాగా వున్న అతని ముక్కు ఆమె చూస్తోంది

కాగితాలు ఇచ్చాడు

ఇచ్చినవి పుచ్చుకొని చూస్తోంది

ఆమె పెదాలు – బుల్లి పెదాలు – చూస్తున్నాడు

వైపు చేయటం కోసం, అతని సర్టిఫికేట్లు ఆమె చూస్తోంది

ఒకటి

ఇంటర్ యూనివర్సిటీ పరుగు పందెం ఐదువేల మీటర్లు మొదటి ప్రైజు

అతను కాళ్ళవైపు చూచింది

కాళ్లు వెనక్కి లాక్కున్నాడు

సర్టిఫికేట్లు చూస్తోంది

రెండు

ఎన్ సీ సీ లో సీ సర్టిఫికెట్టు అతని ఛాతీవైపు చూచింది

బటన్లు పెట్టుకున్నాడు

మూడు

హిందీలో శిరోమణి సర్టిఫికెట్టు

అతని ముఖంలోకి చూచింది

ఆమె కళ్ళల్లోకి చూశాడు

ఆమె అరచేతి రేఖలు గోటితో నెమ్మదిగా గీసుకుంది

అతను నిర్లిప్తంగా గోళ్ళు గిల్లుకున్నాడు

నాలుగు,

సోషల్ సర్వీసు సర్టిఫికెట్టు

ఐదు

బి ఏ ఆనర్సు ప్రొవిజనల్ సర్టిఫికెట్టు

దాని వైపు చాలాసేపు చూస్తూ కూర్చుంది యువతి.

ఆమె

మరో ఉద్యోగానికి అప్లికేషను పెట్టుకొనేందుకు ప్రస్తుతం ఉద్యోగం చేయించుకుంటున్న అధికారి పర్మిషన్

ఏడు

ప్రవర్తన బ్రహ్మాండ మయిందని పార్లమెంటు మెంబరు టెస్టిమోనియల్

ఎనిమిది

తెలివితేటల్ని గూర్చి ప్రొఫెసర్ రికమండేషన్

ఎనిమిది సర్టిఫికెట్లూ కుదురుగా ఒద్దిగ్గా ఒక్కచోట పెట్టింది

శ్యాం ఎదురుగా వున్నాడు టేబుల్ కు ఆనుకొని ఒక్క కాలుమీద సగం కూర్చుని వున్నాడు

ఎర్రగా వున్నాడు ఠీవిగా కనిపించాడు లావూ కాదు సన్నమూ కాదు పొట్టికాదు అనుకుంటే పొడుగు అనవచ్చు చిన్నవయస్సు ముచ్చటైన ముఖం

కాటుక నల్లదనంతో మిళితమైన ఆమె కనురెప్పల కొసల వంపుల సౌందర్యం దర్శిస్తున్నాడు

ఆమె చూపులు క్రిందికి మరలాయి

టో జిగేలుమని మెరుస్తున్న పుల్ బూటు

తల కొంచెం పైకిలేచింది

ఖరీదైన పాంటూ, ఇన్ షర్టు చక్కని బెల్టు నెక్ టై

చూపులు ముఖందాకా పోలేదు

'మీ పేరు

శ్యాం సంకోచంగా అడిగాడు

ఆమె సమాధానం నెమ్మదిగా స్ఫుటంగా చెప్పింది

'శ్యామల'

శ్యాం ఏమిటో రెండువాళ్లు ఉచ్చరించాడు

ప్రశ్నించాడు

'ఎంతవుతుంది

జవాబు చెప్పింది

'ఎనిమిది అణాలు'

శ్యాం ఆశ్చర్యం ప్రకటించకుండా వుండలేక పోయాడు

'ఎనిమిది అణాలేనా ?'

ఆమె తల యెత్తింది చూశాడు రెండు కనురెప్పలు టపీమని ఒకేసారి క్రిందకు దించింది తల దించుకుంది

అవి అతనికి జవాబు

టైపు చెయటానికి ఉపక్రమించింది

శ్యాం వుండబట్టలేక అన్నాడు

ఒకొక్కదానికి రెండేసి కాపీలు'

'నాలుగు కాపీలు తీస్తున్నాను'

శ్యామల జవాబు చెప్పింది

ప్రయత్న పూర్వకంగా శ్యాం, శ్యామల మెడవైపు చూశాడు

ఒక్క రాళ్ళ నెక్లెస్ మాత్రమే వుంది

'టైప్ చేస్తూ తల ఎత్తింది

'శ్యాం మీ పేరేనా ?

'అవును'

'ఇప్పుడివి ఎందుకు?'

'ఒక అప్లికేషనుకు జత చెయ్యాలి

శ్యామల టైప్ చేస్తోంది ఆ పనిలో నిమగ్నురాలయి పోయింది. అతను హుషారుగా వున్నాడు

ఆమె సర్టిఫికెట్లు టైప్ చేసింది ఏదో ది మిషన్‌లో కూర్చుంటూ తలెత్తి చూచింది

అతను ఆమెవైపు చూస్తున్నాడు ముఖంలోకి కాదు

ఆమె పైట ముచ్చటగా గ్నుకుంది

'మీ ఆరోగ్యం మంచిదై వుండాలి లేకపోతే శ్వాస అంత సమంగా వుంటానికి వీలు లేదు

అన్నాడు నాలుక కరచుకున్నాడు

టైపుచేస్తూ శ్యాంవైపు చూచింది

శ్యాం కిలుక్కున నవ్వాడు

అతను చూడకుండా ముఖం మిషన్ వైపు తిప్పుకొని సన్నగా మల్లెమొగ్గలు విచ్చుకున్నట్లు పూలు చూట్లాడు కున్నట్లు చిగుళ్ళు కదిలాడినట్లు వ్వింది

ఏడోది టైపుచేయుట మయిపోయింది

'చూడండి

ఇచ్చింది శ్యామల

కాగితం పట్టుకున్నాడు

చేయి పట్టుకున్నాడనుకొంది వదిలించుకునే ప్రయత్నంచేసి విరమించుకుంది చేతిలో ఏటి ప్రవాహం ఉరవడి, విద్యుత్తు భాషా వినిపించాయి

శ్యాం కాగితం వదల్లేదు

"ఏమిటీ ఇన్ని తప్పులా?" నవ్వాడు

తప్పాలు లేని కౌగితం వైపు చూచి ముఖం మరో ప్రక్కకు త్రిప్పుకొని ప్రపంచంలోని గాలినంతటినీ గుండెల్లోకి పీలుచుకుంది

"లైటు చేయాలి" ముఖంలోకి చూచింది చేయి వదలమని బ్రతిమాలటమది

నవ్వి వూరుకున్నాడు

"వదలండీ!" అంది

వాడు కౌగిలం వదల్లేదు ముఖంలోకి చూశాడు బలముంటే చూసుకో అన్నట్లు వుందా చూపు

చేయి బలంగా లాక్కుంది వ్యర్థప్రయత్న

శ్యాం ముఖంలో వేయి చంద్రుల వెన్నెల వెల్గుల వెల్లువ పొంగింది

కౌగిలం వదిలాడు

చివరి సర్టిఫికెట్లు లైటు చేస్తోంది

మధ్యలో ఆగిపోయింది

"నిన్న పూల కొట్టుదగ్గర, నేను మల్లెలు కొంటున్నప్పుడు, గులాబీ పువ్వు కొన్నది మీరేకదూ"

"అవును"

"ఎందుకు?"

"వూరికినే" నోరు తెరిచి ముయ్యటం మరచిపోయాడు.

ఆమె నవ్వింది

టేబిల్ ముందు కుర్చీ

కుర్చీలో యువతి

టేబిల్ మీద మిషన్

వైపు మిసను అక్షరాలమీద అంతకంటే సుకుమారమూ, సున్నితమూ, అయిన చిన్న వేళ్ళు

టేబిల్ మీద సగం కూర్చున్న అబ్బాయి పక్కగా వాకిలి

వాకిలిలోంచి సిమ్మెంటు రోడ్డు

రోడ్డుమీద ముసలాడు

అక్కడొక ముసలాడు

గదిలో

టేబిల్ క్రింద

రెండు కాళ్ళు

ఒకటి చెప్పుకాలు

మరొకటి బూటుకాలు

చిన్నది, కొద్దిది చెప్పుకాలు పెద్దది గట్టిది బూటుకాలు ఒకదానిమీద మరొకటి సంఘర్షణ

అతన్ని చూచింది ఆమె నవ్వింది

సిమ్మెంటు రోడ్డుమీది లోకంలోంచి ముసలాడు వచ్చాడు

రెండు కాళ్లూ వేరయ్యాయి

నాలుగు కళ్ళూ అతనిమీద కేంద్రీకృతమయ్యాయి.

ముసలాడు అర్థించాడు

'అమ్మా, అర్జీ టైపు చేయాలి"

శ్యామల చెప్పింది

"పని తొందరగా వుంది బాబూ"

ముసలాడు వెళ్ళిపోయాడు

'ఏమిటీ పనితొందర'

ప్రశ్నించాడు

శ్యామల కళ్ళు నవ్వాయి

చుట్టూ చూచి ఆలోచించి, శ్యామల ప్రశ్నించింది

'మీకు పెళ్ళికా లేదుకదూ'

శ్యాం నవ్వాడు ఆనవ్వులో వెన్నెల వాగులునాగాయి ఆ ప్రవాహంలో ఆమె మునిగిపోయి తబ్బిబ్బౌతోంది

అతనుపెదాలు కదిపాడు పెదాలకదలిక శబ్దాలు కలుగ జేస్తుంది ఆ శబ్దాలు పద స్వరూపం పొందుతో వున్నాయి

ఆత్రుతగా, ఆరాటంగా వికసించిన ముఖంతో ఆశగా శ్యామల చూస్తోంది గుండె వేగంగా కొట్టుకొంటోంది

ఆమె ప్రశ్నకు అతను సమాధానం చెప్పాడు అమె విన్నది

అతని జవాబు 'కాలేదు

టైపుచేయటం టకటకా పూర్తిచేసింది

సర్టిఫికెట్లూ టైపుచేసిన కాగితాలు వేరువేరుగా ఒద్దిగ్గా పెట్టింది

శ్యాం ఫైల్లో పెట్టుకున్నాడు

శ్యామల టేబిల్ డ్రాయరు లాగింది అద్దమూ, దువ్వెనా పౌడరూ బైటికి తీసింది

తల దువ్వుకుంది

శ్యాం చూస్తున్నాడు

శ్యామల సిగ్గుపడింది

"అటు రోడ్డుమీదికి చూడండీ" అంది నవ్వి బైటికి చూస్తున్నాడు

శ్యామల పౌడరు ముఖానికి అద్దుకుంది వాకిట్లోకిపోయి శ్యామల రిక్షాను పిలిచింది

రిక్షావచ్చిఆగింది

శ్యామల గది సర్దింది

గదికి తాళం వేయబోతోంది

అప్పుడు

శ్యాం ఎనిమిది అణాలు ఇవ్వబోయాడు

శ్యామల తీసుకోలేదు తాళంవేసింది

రిక్షా చూస్తోంది

ఆమె ఎక్కి కూర్చుంది

అక్కడ

"నేనుకూడా ఎక్కుతా" అన్నాడు శ్యాం

శ్యామల తటపటాయించింది తాళీ ఇచ్చింది

రిక్షా కదిలింది.

పూల బజారులో

శ్యాం రిక్షా ఆపాడు

పూల కొట్టుదగ్గరకు పోయి గులాబీపువ్వు కొనితీసుకు వచ్చి శ్యామలకు ఇచ్చాడు శ్యామల సిగలో తురుముకుంది

రిక్షా కదిలింది

“ఎక్కడికి?” శ్యామల అడిగింది

“ఎక్కడికి?” శ్యాం ప్రశ్నించాడు

“సినిమాహాలుకా?” రిక్షా ప్రశ్నించింది

‘ఆc!” అన్నాడు ఆనందంతో యువకుడు

“ఆc?” అంది భయంగా యువతి రిక్షా పోతూవుంది.

శ్యాం జేబులోంచి వ్రాసివున్న తెల్లకాగితం తీశాడు

దాని నొసటిమీద “అప్లికేషన్” అని వుంది

శ్యాం ఫైలు తీశాడు గ్రూపు కాపీల్లో ఒక్కొక్కటి తీశాడు మొత్తం ఎనిమిది ఆ ఎనిమిదీ అప్లికేషన్‌కు జత చేశాడు

ఆ అప్లికేషన్ ప్రారంభం ‘శ్యామలకు ” అని వుంది

ఇంకా అందులో కొన్ని మాటలు కనిపించాయి

బ్యూటీ

సెన్ సేషన్

హార్టు

లవ్

మే రేప్

అప్లికేషన్ ఫ్రం శ్యాం సంతకం వుంది

"ధన్యురాల్ని" అని అప్లికేషన్ మీద శ్యామల శ్యాం కలంతో వ్రాసింది

రిక్షా సినిమాహాలు దగ్గర ఆగింది

రిక్షావాడికి పది అణాలు శ్యాం ఇచ్చాడు

హాలు ఎదురు చూస్తూ వుంది

ఇద్దరూ నవ్వుతున్నారు

ముందుగా నవ్వుతూవున్న శ్యాం కొంచెం వెనక్కుతిరిగి నవ్వాడు

శ్యామల పాలకడలి కెరటాల కంటే ఉత్సాహంగా సన్నజాజులూ మల్లెమొగ్గలూ దానిమ్మ గింజలుకంటే చక్కగా పలువరస కనబడేలాగా పున్నమి వెన్నెల వెల్లువాకల కంటే ఉన్నతంగా వేనగవుల తేనియ వానలు కురిపించింది

# మంచుశిఖరం

ముక్కాలిపీటమీద కూర్చున్న రమేష్, ఎదురుగా వున్న చెక్కపెట్టెమీద చేతిలోని కత్తి నిలువుగా పొడిచాడు ఠకీమని శబ్దం వచ్చింది

వెనుక వున్న ముకిమీద ఏదో పెద్ద బరువు బలంగా ప్రాకినట్టయింది కరెంటు షాక్‌లాగా త్రుళ్ళిపడ్డాడు వళ్ళుజలదరించింది గగుర్పొడిచింది

చెక్కపెట్టెలోనికి దిగిన కత్తి గుడ్డిగా వెలుగుతున్న దీపం కాంతిలో తళుక్కు తళుక్కుమని మెరుస్తోంది

శరీరంలోని రక్తాన్నంత శక్తీ కూడదీసి చేతిలో కూర్చుకొని నరాలన్నీ బిగపట్టి కత్తి పిడిమీద చేయివేశాడు రమేష్

ముఖం నల్లగా బొగ్గులాగావుంది కళ్ళు కుంచించుకుపోయాయి పళ్ళు నోటిలో ఒకదాన్ని మరొకటి బలంగా నొక్కుకుంటున్నాయి మధ్యనున్న మెత్తని పెదాలు ఒత్తుకుపోతున్నాయి ముక్కుపుటాలు కంపిస్తున్నాయి నొసటిలో ముడతలు పడ్డాయి వెంట్రుకలు జీరాడుతున్నాయి

రమేష్ కుడిచెయ్యి కత్తిపిడిమీద బలంగా నొక్కిపట్టి వుంది ఎడంచెయ్యి వెంట్రుకల్లో చొరబడి పిడికిలి ముడుచుకుంది జుట్టు చిక్కుచిక్కుగా రేగింది

"ఇవాళ రాత్రి చౌడేశ్వరి గుండెల్లో ఇది దూసుకుపోవలసిందే"

కత్తివైపు చూశాడు రమేష్ అతని నిశ్చయం అచలం చలమైంది

"పాపిష్టి పీనుగ! గుండెల్లోంచి కొంచబ న్నెముకను పగలదీసుకొని వీపుమీదుగా రావాలి

అతని ముఖం మినుకు మినుకు మంటుంది, ఆ కాంతిలో అస్పష్టంగా కనబడుతోంది. వెలుగునీడలు అలా వ్యాపిస్తు న్నాయి అతని ముఖంమీద. ఒక [illegible] తుమీద [illegible] లుగు చీకటీ - వెలుగూ -

"దాని రక్తంతో కత్తి స్నానం చేస్తుంది.'

బలంగా వ[illegible]ట్టిన కత్తి చెక్క లోకి అంగుళం దిగింది తల క్రిందకు వాలింది కత్తి పి[illegible]మీద పి[illegible] [illegible]మీదు నోసలు

"దాని ముఖం చెక్కాలి"

రక్కుల కత్తిపుచ్చుకున్నాడు మరో [illegible]లో నెమ్మది వచ్చాడు. కార్యక్రమ మాలోచించుకున్నాడు. దీపం [illegible]లుగు తోంది వెలుగు ముఖంమీద పడుతోంది. ఆలోచిస్తున్నాడు

ఉదయమే తను కలకత్తా పోతున్నట్టు చౌడేశ్వరితో చెప్పాడు అందుకు తగ్గట్టే కలకత్తా రైలులో బెర్తు రిజర్వు చేయించుకున్నాడు. మరొకడ్ని తన టిక్కెట్టుమీద కలకత్తా పంపుతున్నాడు. తను వ్రాసి వాడికిచ్చిన వుత్తరం కలకత్తాలో వాడు పోస్టుచేస్తాడు చౌడేశ్వరి హత్యతో తన కేమీ ప్రమేయం లేనట్లు గట్టి సాక్ష్యం

అది తనతో నువ్వు కలకత్తా వెళ్ళవద్దు అంది దాని మాట తను తిరస్కరించాడు అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాడు. బయలుదేరి వెళ్ళిపోయినట్లు కూడా కబురుచేశాడు

సాయంకాలం, వూళ్ళోవున్నట్లు ఎవరికీ తెలియకుండా వుండేందుకు కొంచెం దూరంగా వున్న హాల్లో సినిమా కెళ్ళి బాక్సులోంచి మధ్యలోనె బయటకువచ్చాడు

తన వూళ్ళో లేని విషయం తెలిసిక చౌడేశ్వరి చెప్పకుండా వాణ్ణి మేడలోకి పిలిపించుకోబోయింది ద్రోహిదొరికి పోతుంది నమ్మకహారాం దొరికిపోతుంది

రమేష్ పళ్ళు పటపట లాడించాడు చప్పున పైకి లేచాడు చకచకా నాలుగడుగులు తలుపుదాకా వేశాడు. తలుపుదగ్గర కొంచెం సేపాగి తిరిగి వచ్చి కూర్చున్నాడు

"వాళ్ళిద్దరూ ఇంటి దగ్గర దొరికిపోతారు వీలుంటే వాడుకూడా సఫా"

చేతిలోని కత్తి ఒక్కసారిగా గట్టిగా పత్తాడు

ఏకధారగా వర్షం చినుకులు నెత్తిమీద పడుతున్నా గమనించని రమేష్ బట్టలు బాగా తడిసిపోయింతరువాత చలిపుడుతున్నప్పుడు గ్రహించాడు, తను బాగా తడిసిపోయిన సంగతి

క్రింద భూమి బాగా తడసిపోయింది ఆ తాటాకు చిల్లుల్లోంచి వాననీరు టుపుక్కు టుపుక్కున ఒక్కొక్కబొట్టు పడుతోంది ఒక్కొక్కచోట ఏకధారగా వర్షం తడకగోడల్లోంచి జల్లు గదిలోకి వస్తోంది తడక తలుపు గాలికి ఎడాపెడా కొట్టుకుంటోంది వర్షం గదిలోకి వస్తోంది

ఝుమ్మున్న ఈదురుగాలి తోలింది కోష్టుమీద ఎలెక్ట్రిక్ దీపంకాంతిలో వర్షం చినుకులు మెరుస్తూ కురుస్తున్నాయి ఎటుచూసినా నిశీధి నిశ్శబ్దంగా నిద్రపోతోంది పోలీసుల విజిల్స్ రెండో మూడో వినిపించాయి కారుచీకటి ఆకాశంలో క్రమ్మివుంది

ఈదురుగాలి తోలింది వళ్ళు ఝలదరించింది గాలి వుధృతికి పైగా బట్టలన్నీ తడిసి పోయాయి పాడుగాలి! గంట్రుకు తెంగోడె అవలు వంటరిగోవిడెం కూడదు — దౌశ్వారి — పాపిష్టి పీనుగ!

ఈదురుగాలి తోలింది ఎదురుగా ట్రంకుపెట్టెవుంది. దాంట్లో బట్టలున్నాయి అవిమాత్రం తడిసివుండవు వెలుపల వున్న బట్టలు తడిసిపోయాయి పొడిబట్టలేవు ఇప్పుడు తొందర ట్రంకులోంచి బట్టలుతీసి వేసుకోవచ్చు దుప్పటి కప్పుకోవచ్చు

వర్షం బాగా కురుస్తోంది బట్టలు వేసుకున్నా, దుప్పటి కప్పుకున్నా తడిసిపోతాయి బట్టలు పెట్టెలోంచి తీయటం అనవసరం అలానే తడిసిన చాపమీద కూర్చున్నాను

పాడుకొంపలు! అద్దె వచ్చినంతవరకేగాని రిప్పేర్చెయ్యాలనే ఉద్దేశ్యమే వుండదు వీళ్ళకి ఛీ! ఈ మురికిపేటలోని యిళ్ళన్నీ ఇంతే!

ఈదురుగాలి చలికి నరాలు వాలకర్చుకు పోతున్నాయి తనచుట్టూ పరిస్థితులు బాగా నీరు ముట్టడించింది గాలి హోరు పెడుతోంది

తళుక్కున కత్తి మెరిసింది!

అది చావాల్సిందే! తనని ఎన్నివిధాల ఉపయోగించుకోవచ్చో అన్నివిధాలా ఉపయోగించుకుంది అది తనని నమ్మిందికదా అని తనుదాన్ని నమ్మాడు తను వూహించనైనా వూహించని, తనకు జరిగిన ఈ ద్రోహాన్ని నిదర్శన పూర్వకంగా విని, కళ్ళారా చూశాడు

ఒకవేళ దానిదగ్గర తప్పు లేదనుకోవచ్చు అయితే ఆ నల్లకోటువాడు ఎందుకు దాని మేడదగ్గరకు వస్తున్నట్లు ఇది సమాధానం దొరకని ప్రశ్న! దాన్ని హతమారిస్తే తప్ప తనకు నిద్రపట్టదు

టంగుమని మ్రోత!

తత్తర పోయాడు రమేష్ కత్తికోసం వెదికాడు చుట్టూ చూశాడు కన్పించలేదు చేతినిచూచుకున్నాడు చేతిలోవుంది రెండోగంట మ్రోగలేదు రెండోగంట వినిపిస్తుందేమోనని నిరీక్షించాడు కాని విన్పించలేదు

తాలూకాలోంచి కాపలావాడు మ్రోగించిన గంట అది టైం ఒంటిగంట! తనురెండు గంటలకు పనిపూర్తిచేసుకోవాలి అదీ తన నిర్ణయం! ఏర్పాటు! ఇంకొక్క గంట టైం!

వెధనకాలం ఒకసారి త్వరపెడుతుంది ఉత్సాహమిస్తుంది మరొకసారి నిరుత్సాహ పరుస్తుంది ఇంక గంట దాకా తనేమీ చేయకూడదు

ఈదురుగాలి చలికి బట్టలు దోహదమిచ్చాయి నరాలు కొరుక్కు తింటోంది పాడుచలి

ఇలాంటి వర్షాకాలం ఈదురుగాలి, చలికాలాలు తన్ని ప్పటికి ముప్ఫైకి పైగా దాటాయి ఇంత బాధ తనేచలికాలం లోనూ పడలేదు

చౌడీశ్వరితో దాదాపు నాలుగు ఇలాంటి చలికాలాలు సరీగ్గా ఇలాంటి పూరికొంపల్లోనే వుండి చలి మరచిపోయాడు

జేబుగొట్టిన నేరంతో జైలు శిక్షననుభవించి ప్రారం భిస్తున్న క్రొత్త యవ్వనంతో బయటికివచ్చిన తొలిదినాల్లో తను చౌడీశ్వరిని కలుసుకున్నాడు అప్పటికామె ఫలానావాడి భార్య అనబడే స్థితిలోవుంది దాని తండ్రి ఎవరో ఆరోజుల్లో తనకు తెలియదు లైసెన్సుకూలీ రాముడు, కొంచెం వయస్సు పైబడినవాడు, దానిపెనిమిటి

జైలు గోడల్లోంచి విశాల విశ్వంలోకి వచ్చిన తనకు నచ్చింది చౌడీశ్వరి అంతే దాన్నిలేపుకొచ్చి మరోపట్టణంలో కాపరం పెట్టాడు తను ఏ ఇబ్బదీ లేకుండా జేబుఒకొట్టే వ్యాపారంలో దాదాపు నాలుగు సంవత్సరాలు కదలి పోయాయి

అయితే కాలగమనం సాఫీగా సాగలేదు ఆ మధ్య వక్రించింది

ఈదురుగాలి తోలుతోంది వర్షం ఎడుతోంది

తలమీదపడిన వర్షపునీరు చెంపలమీదుగా ముఖం మీదుగా జారుతోంది రమేష్ తుడుచుకున్నాడు

పుటుక్కు పుటుక్కున పైనించి వర్షం చినుకులు పడు తున్నాయి తడికతలుపు జల్లు వేగానికి తట్టుకోలేక పోతోంది ఒక్కవూపుతో వర్షమూ, గాలీవచ్చి తడికతలుపు నెట్టాయి

తలుపు కొరుచుకుంది వర్షం గదిలోకి వస్తోంది రమేష్ లేచి తలుపు దగ్గరకు నెట్టి మళ్ళీవచ్చి తడిచాపమీద కూర్చున్నాడు

తను ఇలాంటి మూడు చలికాలాలు చౌడేశ్వరికి దూరంగా, వర్షానికి తడవకుండా, చలికి బాధపడుతూ జైలు గోడలమధ్య గడిపాడు

తను జైలుకి పోయిందికూడా దానికోసమే ఆనాడది బజారులో బట్టలషాపులో కనబడ్డ ఆ పట్టుచీర కావాలని కోరటమే తప్పా అది కోరింది, బాగానేవుంది ఆడదానికి అలంకారాలమీద ప్రేమకదా! తన తెలివితేట లేమ య్యాయి ?

తను దొంగిలించటంలో తెలివితక్కువపని చేశాడు పోనీ దొరికిపోయినప్పుడు వూరుకున్న పోయేది రోషంతో షాపువాడ్ని చెటికచేశాడు తరవాత తన వీపు పగిలిపోయింది ఐదారు నెల్లతో తప్పిపోవాల్సిన జైలుశిక్ష మూడు సంవత్స రాలకు పెరిగింది

నిజంగా ఆ మూడు సంవత్సరాల్లో ప్రభుత్వం తన కెంతో అ కారం చేసింది జీవితగమనాన్ని మార్చింది పురో గమనంకాదు తిరోగమనం చెడ్డమార్గంలోకి న చాడు జైలు లోంచి బైటికివచ్చి ర మేష్

విసురుగా ఈదురుగాలి తోలింది తలుపు తటపటా కొట్టుకొంగి సరాన్ని కా ? సిపట్లు వలి పుడుతోంది టప్పావ దీపం ఆరిపోయింది

జైలు గోడలు అరుగులు చలి బాధ పోలీసులు ఇనుప కటకటాలునీడలు దొంగలు రౌడీలు హంతకులు

మూల్గులు అగుపులు ఘోషలు బూటుల టకటకా గుడ్డి దీపాల వెలుగునీడలు తాలూకాలోంచి గంటల మ్రోతలు టవున్లోంచి రేడియో వాగుడు కలకలాలు వరుసగా చిత్రం లాగా కదలిపోయాయి అన్నీ పూర్వస్మృతులు

ఉరుమురిమింది మెరపు మెరిసింది ఎదురుగావున్న కత్తి తళుక్కుమంది చీకటిలో, చలిలో, కత్తిమీద చేయి వత్తి పట్టాడు రమేష్ ఎదురుగావున్న చెక్కపెట్టిమీద పెట్టాడు

హత్య చేయటం నేర్పింది చౌడీశ్వరి దొంగతనం చేయటం మాత్రం నేర్పలేదు హత్యచేయటానికి పురికొల్పింది ఉత్సాహ పరచింది అది నేర్పిన విద్యకు అదే బలికాబోతోంది

దాని బలవంతంమీద ఆనాడు తను వాడ్ని హత్య చేశాడు

తన అభిమతం ప్రకారం తనంత తాను చౌడీశ్వరిని హత్య చేయబోతున్నాడు నేడు

తను మూడు సంవత్సరాలు జైలు జీవితం గ పాడు బయటికి వచ్చిన మూడు నెల్లకుకూడా తను ఆమెను చూడ లేకపోయాడు అప్పుడది ఒకరోజు స్వంతకారులో బీచ్ కి బయలుదేరింది ఆరోజు దాన్నిచూచినప్పుడుకూడా పోల్చుకోలేకపోయాడు

చాలా ప్రయత్నం చేసింతరవాత ఆకారుకల్గిన యింటిలో ఒకనాడు దాన్ని కలుసుకున్నాడు మాట్లాడాడు మాట్లాడింది, వినీలాకాశంలో స్వేచ్ఛగా విహరించే పావురం

బంగారు పంజరంలోంచి మాట్లాడినట్లు ఇప్పుడామె ఒక ధన వంతుని భార్య

తర్వాత చాటు మాటుగా నాలుగైదు నెల్లుదాకా తను చౌడీశ్వరిని కలుసుకుంటూ వుండేవాడు ఆ కాలవ్యవధిలో ఆమె, భర్త మరణానంతరం భార్య ఆస్తికి వారసురాలు అయ్యేట్టు వీలునామా వ్రాయించుకుంది ఆపైన తనని పురి కొల్పింది పెనిమిటిని హత్య చేసేందుకు

తను ఆ ధనవంతుని హత్య చేశాడు

తనమీద నేరంలేకుండా పోయేందుకు మరిరెండు హత్యలు చేయవలసి వచ్చింది ఆ పనులు ముగించుకున్నాడు

ప్రాణంమీద తీపివలన ప్రవాసం పోవలసి వచ్చింది నిరాశాపూరిత హృదయంతో వెళ్ళిపోయాడు

ఈదురుగాలి తోలి చలిపుట్టింది

ఒక ఈదురుగాలి చలికాలం పోయిందాకా తను ప్రవాసంలోనే ఉండవలసి వచ్చింది

మళ్ళీ చౌడీశ్వరి దగ్గరకు చేరుకున్నాడు

అప్పటికామె ఆ ధనవంతుని పేరిట వైధవ్యం పుచ్చుకుంది ఆస్తికి వారసు రాలయింది

చలిగాలి కొంచెం తగ్గింది వర్షం తిరుగుముఖంపట్టింది ప్రచండంగా గాలీలేదు ప్రళయంగా వానాలేదు

ఆపైన చుట్టుప్రక్కలవాళ్ళు అనుమానించటం జరుగుతోంది పల్లెవిడచి పట్టణం వచ్చి, వ్యాపారంచేసి లాభమూ, పేరు ప్రఖ్యాతులూ పొందిన ధనవంతుని దూరం చుట్టం

రమేష్ ఇలా తను చౌడేశ్వరి మేడలోనే దాదాపు మూడు వర్షాకాలాలు చలి రోజుల్లో గడిపాడు

ఇద్దరికీ వున్న సంబంధం వూరు శంకిం చటం జరిగింది ఆ విషయం తనకుకూడా తెలుసు ఒకనాడు తను దాన్ని అడిగాడు 'ఈవూరు విడిచేద్దామని' అది వద్దు ప్రమాదం' అంది తనాపైన ఏమీ మాట్లాడ లేదు

ఒకనాడు తను వూహించని విధంగా జరిగింది అది తనకు ఏకారణమూ చెప్పలేదు కాని నెలదాకా మేడవైపు రావద్దు అంది తను ఏ అవసరమోనని దాని మాట శిరసా వహించాడు నెలపోయిం తరవాత దాన్ని కలుసుకున్నప్పుడు అది పలకటమే ప్రళయమై పోయింది

తను దాని దగ్గరకు పోవటం తిరిగి నిరుత్సాహంతో రావటం నిన్నటిదాకా చేస్తున్నాడు అనుకున్నప్పుడు అవసరమున్నప్పుడు అడిగింది పొందలేకపోతున్నాడు ఒక్కొక్కసారి అడగటానికే అవకాశం లేకుండా పోతోంది

నిన్న ఉదయం వాడు ఇంట్లోకి పోవటం తను కళ్ళారా చూశాడు వాడలా నాలుగు సంవత్సరాలుగా వస్తున్న సంగతి నిదర్శన పూర్వకంగా తెలుసుకొని ఈనాడు ప్రత్యక్షంగా చూశాడు హృదయం పగలగోసినంత బాధపడ్డాడు

ఉరుమురిమింది! మెరుపు మెరిసింది! కత్తి తళుక్కుమంది

"ఇవాళ ఇది దానిగుండెల్లో దూసుకుపోవాలి"

కోపంతో ముడుచుకున్న పిడికిలి విప్పి, కత్తి పిడిమీద పెట్టాడు రమేష్

ఒటిష్టమైన తనకాళ్లు వణుకుతున్నాయి కుడికన్ను అదురుతోంది గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి శరీరంలో ఏదో తొందరతొందరగా వుంద న విజ్ఞానాన్ని పూర్తిగా కూడదీసుకొని ఆలోచిస్తున్నాడు పూనికతో ముని గాళ్ళమీద నిలబడ్డాడు

దీపం ఆరిపోయింది

వెలిగించాలి

జేబు వెతికాడు రెండో మూడో పుల్లలున్న అగ్గిపెట్టె తడిసివుంది

"దీపం వెలిగించకపోతే ఏం" తనలో తానునుకున్నాడు రమేష్

చీకటి – ఆకాశంలో, భూమిమ్మీద, భూగోళంలో ప్రపంచంలో – అంతా చీకటి చుట్టూ చీకటి గదిలో చీకటి హృదయంలో చీకటి చీకటి కన్య కాటుక కంటినీరు జారుతూ వున్నట్లు ఒక్కొక్క-బొట్టు వర్షం పడుతోంది

టంగు టంగున తాలూకాలోంచి రెండు మ్రోతలు వినిపించాయి

నంటికి కరెంటు అంటించి నట్లయింది అసంకల్పిత ప్రతీకారచర్యకు అలవాటు పడ్డ కండరాలు టక్కున రమేష్‌ని పైకిలేపాయి వంగి పెట్టెమీద కత్తి అందుకున్నాడు గుడ్డతీసి కత్తికి చుట్టి భద్రంగా జేబులో పెట్టుకున్నాడు

బయలుదేరబోయాడు

చలిగాలి తోలింది బయట వర్షం ఒక్కొక్క-బొట్టు పడుతూనేవుంది తనవంటి బట్టలు తడిసి వున్నాయి చివరకు

కత్తికి చుట్టిన బట్టకూడా తడిసివుంది పొడిబట్టలు పెట్టెలో వున్నాయి

జేబులో కత్తిచేతికి తగిలింది తనకు వెంటనే హత్య విషయం గుర్తుకొచ్చింది బట్టలు వ్యవహారం ఆలోచిస్తూ కాలంవ్యర్థం చేయటం అనవసరం వేసుకుంటే పొడి బట్టలు వేసుకోవటం లేకపోతేలేదు ఇక్కడ ఎక్కువ ఆలోచన పనికి రాదు హత్య జరగవలసిన కాలమూ – దాని ఏర్పాట్లూ – సక్రమంగానే వున్నాయి తానిక్కడ బట్టలు మార్చుకుంటూ కూర్చుంటే కాలం – ముహూర్తం – దాటి పోతుంది ఆపైన పని జరగదు

వెంటనే బయలుదేరాలి

చలిగాలి !

రమేష్ వెనుకంజవేశాడు మళ్ళా అతన్ని ఏదో ఆలోచన చుట్టుముట్టింది ఈ హత్య సంపూర్ణంగా విజయమవుతుందని తనకు నమ్మకంలేదు ఉన్న పరిస్థితీ ఆలోచించుకున్న విధానమూ, స్థూలదృష్టికి బాగానే వున్నాయి కాని నిశితంగా పరిశీలిస్తే ఏదో లోపమూ వున్నట్లు తనకు క్షణ క్షణమూ శంక కలుగుతూనే వుంది

ఒక వేళ ఈ హత్యలో దొరికిపోవటం జరిగితే మళ్ళీ ఆస్వెట్టరు వేసుకోవటం జరగదు ఆ మఫ్లర్ని మళ్ళీచూడ లేదు ఇవాళ ఇస్త్రీనుంచి వచ్చిన ఆ ఖరీదైన పాంటూ, షర్టూ తను చూడటం తటస్థించదు వాటిని వేసుకోవలసిందే !

అతని ఆలోచన కార్యరూపం ధరించింది పొడిగుడ్డ కత్తికి చుట్టాడు అతనికి వెంటనే గుర్తుకు వచ్చింది ఎంత

చెడ్డా తను వెళ్లుతోంది వాసీశ్వరి యింటికి నిద్రలో వున్నప్పుడు దాన్ని హత్యచేయటం కుదరక మేలుకునే వున్నప్పుడు చేయవలసివస్తే అది తనని చూచి ఏవగించుకునేట్టుగాని, అనుమానించేట్టుగాని వుండకూడదు 

ఈ విషయం గుర్తుకు రాగానే చెక్కపెట్టెతీసి అద్దాన్ని అందుకొని అలావదిలేసి, దువ్వెన బైటికితీసి చూపుడువ్రేలుతో పాపిటతీస్తూ తలదువ్వుకున్నాడు

జేబులో కత్తి చేతికి తగిలింది అతనికి జరగవలసిన విధానమంతా అలా చిత్రంలాగా మనః ఫలకంలో మెదిలింది వెంటనే బయలుదేరాడు కాలికి ముక్కాలిపీట తగిలింది గది తలుపు వేశాడు రోడ్డుమీదకు వచ్చాడు

ఎక్కడో కుక్క మొరిగింది దూరంగా తీతువు కూసింది పొలిమేరల్లో నక్క అరచింది నిశీధి గురకపెట్టి నిద్రపోతోంది

రమేష్ నడుస్తున్నాడు! 

పాడుచలి! మెడమీద మఫ్లర్ చెవులమీదుగా తలకు చుట్టాడు రెండుజేబుల్లో చేతులు పెట్టుకున్నాడు కత్తి చేతికి తగిలింది



నడుస్తున్నాడు!

రెండో ఆట సనిమా అన్ని హాల్లో వదిలిపెట్టారు రోడ్డు నిర్మానుష్యంగా వుంది నిశాకన్య జడలాంటి తారు రోడ్డుమీద, కొప్పులోని పూలులాంటి గడ్డిదీపాల కాంతిపడి మెరుస్తోంది ఇక్కడే కొంచెం వెలుగు

నడుస్తున్నాడు!

(4)

చాడీశ్వరి ఆ కిటికీ దగ్గరిగా నిద్రపోతుంది ప్రక్క నున్న గొందిలోంచి కిటికీ ఎక్కి, చెక్కలునెట్టి లోపలికి చొరబడి, నిద్రపోతున్న చాడీశ్వరిని పడకమీదే కత్తికి బలి యివ్వాలి

ఆ ఆలోచనతో జేబులోని కత్తి గట్టిగానొక్కిపట్టాడు పళ్లు పటపట నాడించాడు గట్టిగా భూమిని వత్తిపెట్టి నడు స్తున్నాడు

నడుస్తున్నాడు !

రోడ్డు ! రోడ్డుమీంచి దాటితే మలుపు మలుపుతిరి గితే సందు సందులోంచి నాలుగు బారల దూరంలో మేడ మేడ ప్రక్కగా గొంది గొందిలోంచి కిటికీలోకి మార్గం కిటికీలోంచి గదిలోకి గదిలో

జేబులో కత్తికంటే ముఖంలోని పెదాల్ని గట్టిగా నొక్కి పట్టాడు రమేష్ బలంగా పెద్దపెద్ద అంగలు వేసు కుంటూ పోతున్నాడు

నడుస్తున్నాడు !

మలుపు తిరిగాడు సందు దాటాడు గొందిలోకి పోయాడు కిటకీ ఎక్కాడు కూర్చున్నాడు ఇక లోపలికి దూకబోతున్నాడు పడకవైపు చూశాడు

ఆశ్చర్యం ! పడకమీద ఆమె లేదు ఖాళీగావుంది పరిశీలనగా చూశాడు మసకవెలుగు పడక బాగా నలిగి వుంది !

తలుపుదగ్గర శబ్దమయింది అటువైపు చూశాడు, కిటి కీలో చెక్కప్రక్కగా నక్కికూర్చున్న రమేష్ చాడీశ్వరి

నిద్రకళ్ళతో తలుపు గడియ వేసింది పడకవైపు నడుస్తోంది ఆమె పడకపైన మేను వాల్చిందాకా ఆగాడు

ఆపైన వెనుదిరిగాడు కిటికీలోంచి మెల్లగా గొంది విడిచి, సందుదాటి, మలుపుతిరిగి మేడముందుకువచ్చి రోడ్డు వైపు పరిశీలనగా చూశాడు రమేష్

ఫర్లాంగు దూరంలో రోడ్డు మలుపుతిరిగి మెయిన్ రోడ్డులో కలసేచోట - మునిసిపాలిటీ ఎలెక్ట్రిక్ లైటు నీడలో ఒక పురుషుడు కదలిపోతున్న నీడను చూశాడు, రమేష్ రమేష్ అప్రయత్నంగా పెదాలు కదిపాడు "వాడ్ని పంపించివేసింది ఆ నల్లకోటువాడు"

తను రోజూ రాత్రి రెండూ మూడూ గంటలప్పుడు వచ్చి, తిరస్కరింపబడి తిరిగిపోతున్నాడు కొన్నిసార్లు తలుపు తియకుండానే పొమ్మనేది కొన్ని సార్లుకొట్టేది తిట్టేది. చివాట్లు పెట్టేది ఏడుస్తూ చెప్పేది లాలనగా బతిమాలేది డబ్బు ఇచ్చేది

మరికొన్నిసార్లు తనకువచ్చే నాలుగు మాటలు చెప్పి, మభ్యపెట్టి వెళ్లిపొమ్మనేది మొత్తంమీద తనని వెళ్ళగొట్టేది ఎక్కువసేపు మాట్లాడేదికూడా కాదు

ఇవాళ అలా కుదరదు తను నాలుగు రోజుల నాడే ప్లాను వేశాడు ఇవాళ వంటమనిషిని పంపేస్తుంది దానిభర్తకు దూరం చుట్టమైన తను కలకత్తా వెళ్ళిపోయినట్లు కావలసినంత సాక్ష్యం ఆవచ్చినవాడుకూడా వెళ్ళిపోయాడు

ఇప్పుడు ఇంట్లో అది ఒక్కతే!

జేబులో కత్తి గుచ్చుకొచ్చింది అది పరలోకయాత్ర చేస్తుంది

అది మేలుకోనేవుంది కిటికీలోంచి దూకి కార్యభంగం ఫాందేకంటే రోజూవచ్చే వాడినేకనుక మామూలుగానే వాకిట్లోంచిపోయి, చేయదల్చుకున్న పనిచేయటం శ్రేయస్కరం

పోయి తలుపు తట్టాడు సమాధానం రాలేదు

మళ్ళా తట్టాడు జవాబు రాలేదు కొంచెంసే పాగాడు అది లేచినట్లుగానీ, నడచినట్లుగానీ, తలుపు తీసే పద్ధతి వున్నట్లుగానీ, తనకెమీా తెలియరావటం లేదు

మళ్ళీ తలుపు తట్టాడు బదులులేదు

పెద్దగా తలుపు మీాదకొట్టి 'వాడీ' అని కేకేశాడు ఆమె పలకలేదు తలుపు తీయలేదు

రమేష్ అక్కడ నిలువదలచుకోలేదు వెనుదిరిగిపోయి, చరచర మునుపటి కిటికీలో కూర్చుని వాడీశ్వరి వైపు చూశాడు

ఆమె మంచంమీాద విలాసంగా పడుకుంది నుదుటి మీాద ముంగురులు కదలాడుతున్నాయి మసక వెలుగులో చెక్కిలి ముద్దొచ్చేట్టుంది శ్వాస సమంగా వస్తోంది

చలిగాలికో, ఆమె విలాస వైఖరికో అతనివీపు పులకరించింది

మెల్లగా కిటికీ దగ్గరగా దిగాడు

ఆకాశంలో లేని చంద్రబింబం వాడీశ్వరి వదనంలో మెరుస్తోంది

చల్లగా, పిల్లలాగా అడుగుల్లో అడుగులు వేసుకుంటూ రెండో గదిలోకి వెళ్ళి లైటు వేశాడు సన్నని దీపం వంటింట్లో వుంది

చాడీశ్వరి పడకగది ప్రక్కనున్న గదిలోని వెలుగును పంచుకొంది ఆమె లేవలేదు ఆమె ముఖంమీద వెలుగు కిరణాల శాతం పెరిగింది శరీరంమీదకూడా వెలుగు పడుతోంది

కోక! ఆశ్చర్య పోయాడు రమేష్ తను దీన్ని కలుసుకున్న మొదటి రోజుల్లో కట్టుకోమనికొని యిచ్చిన పట్టుచీర! ఇవాళ కట్టుకుంది దీనికున్న కోకల్లో ఇది ప్రాణతుల్యమయింది ఇవాళ వీడికోసం కట్టుకుంది

తాళి!! నిలువునా చలించి పోయాడు రమేష్ తను తనచేతులతో దాని మెడలో లేపుకొచ్చిన రోజుల్లోకట్టినతాళి ఆరు సంవత్సరాలుగా అది దీని మెడలో తను చూడలేదు చీరె దొంగిలించిన నేరంతో జైలుకు పోతూ చూశాడు ఇప్పుడు మళ్ళీ చూడగలిగాడు వీడెవడో దౌర్భాగ్యుడు లాగా వున్నాడు తాళికూడా కొనలేని బాపతు

గాజులు!!! చేతికి గాజులున్నాయి రాక్షసుడికి కోపం వచ్చినట్లు ముంచుకొచ్చింది కోపం, పిచ్చికోపం

పూలు!!!! జడ! జడ వేసుకుంది పూలమాల తురుముకుంది

చాడీశ్వరి కదిలింది కొంచెం ప్రక్కగా వొత్తిగిలి పడుకుంది

ఇవాళ పునిస్త్రీ వేషం వాడితో లేచిపోవటానికా? లేక ఈ వేషంతో ప్రతిరోజూ వాడికి దర్శనమా? పళ్ళు పటపట లాడించాడు రమేష్

జేబులో కత్తి చేతికి తగిలింది

కత్తి పైకి తీశాడు తళుక్కుమని మెరసింది పొడవటానికి వుంకించాడు

వెన్నెముకమీద ఎవరో బలంగా చరిచినట్లయింది త్రుళ్ళిపడి వెనక్కు తగ్గాడు

చౌడీశ్వరిని ఇప్పుడు పొడవ్వొచ్చు చనిపోతుంది ఆ విషయంలో ఆటంకమేమీలేదు కాని తను దాన్ని పొడిచిం తరవాతకూడా ఆ వస్తున్న వాడెవడో తనకు తెలియదు వాడ్ని తెలుసుకోకపోతే లాభం లేదు తెలుసుకోవాలి దీన్ని లేపాలి

తను కనుక్కోదలచుకున్న విషయంతో నిజంగా తనకు ప్రమేయం లేదు వాడెవడైనా తను చేయగలిగింది కూడా లేదు తనకు అవసరంలేని ఆవిషయాన్ని తెలుసుకోకపోయినా ఫరవాలేదు వాడికీ దీనికి సంబంధం వుంది అందువల్ల, ఆ చెడు ప్రవర్తనవల్ల చావటం న్యాయం బలి కాబోతోంది వాడితో తనకేమిటి? దీన్ని పూర్తి చేయాలి

కత్తి పైకెత్తాడు

చౌడీశ్వరి కదిలింది

ఇది చేసుకున్న ఏ పుణ్యమో దీని జీవిత ప్రమాణం కొన్ని సెకండ్లు పెంచుతోంది హాయిగా నిద్రపోనిచ్చేందుకు ఏది ఏమైతేనేం? ఇది కదిలింది, కనుక దీన్ని లేపి, వాడెవడో?

ఎందుకు వస్తున్నాడో? తేల్చుకోవాలి దాని సమాధానాలు తను నమ్మాడు

తను దాన్ని లేపేది, చెప్పే విషయం వినేందుకు ఇది చెప్పింది విన్నా తను నమ్మాడు, చంపటం ఖాయం మరిలేపట మెందుకు?

దీన్ని లేపి, తనకింత ద్రోహం చేసినందుకు, ప్రతిఫలంగా శక్తిలేని దాన్నిగాచేసి, మాట్లాడ నివ్వకుండా, కదలనివ్వ కుండాచేసి, చూస్తూ వుండగానే గుండెల్లో కత్తి గుచ్చాలి

తనలో ఎందుకో రెండురకాల భావాలు కలుగుతు న్నాయి అర్థం కావటంలేదు తను ద్వంద్వాతీతుడు దీన్ని చంపటం ఖాయం లేపటం అవసరం

కత్తికి గుడ్డ చుట్టి జేబులో పెట్టుకున్నాడు లైటు వేశాడు

ఆమె వీపుమీద చేయివేసి చిన్నగా 'చౌడీ' అని పిలచాడు

ఆమె ప్రక్కకు వొత్తిగిలింది దుప్పటి పూర్తిగా కప్పు కుంది

'చౌడీ' పిలచాడు రమేష్ ఆమె మెల్లగా కళ్ళువిప్పి, అతన్నిచూచి మళ్లీ ముసుగు తన్నింది

'చౌడీ' మళ్ళీ పిలచాడు

చౌడీశ్వరి కళ్ళు తెరచి, రమేష్‌నిచూచి 'మీరా' అని కళ్ళు మూసుకొని, కళ్లుమూస్తూ, తెరుస్తూ, 'నిలుచున్నా రేం? కూర్చోండి అని వెనక్కు జరిగి, వెంటనే దుప్పటి తొల గించి, వాకిలివైపు చూచింది వేసిన గడియ వేసినట్లేవుంది

'ఎలావచ్చారూ?' తియ్యగా ప్రశ్నించింది నవ్వు ముఖంతో కళ్ళు నులుముకుంటూ, ఆవులిస్తూ

రమేష్ కిటికీనైపు చూశాడు ఆమెకూడా అటు చూచింది కిటికీ తీసివుంది

'ఏం అలావున్నారూ?' ముఖంలోకిచూచి, 'ఏం ఇలావచ్చారూ?' కిటకీలోకి చూచింది వెంటనే తనే మాట్లాడింది 'నా కోసమా? నవ్వింది రమేష్ మారుపలకలేదు

ఆమె మళ్ళీ ప్రశ్నించింది 'నువ్వీవేళ కలకత్తా వెళతానన్నావు నేను వద్దు అన్నా వినలేదే అనుకున్నా విన్నావన్నమాట?' పకపకా నవ్వింది

'నోర్మూయ్' పెద్దపులిలాగా అరిచాడు రమేష వెంటనే ప్రశ్నించాడు 'ఎవడువాడు?' ఆమెవైపు చూశాడు 'జవాబు చెప్పు'

"వాడెవడు?" చిలిపిగా నవ్వుతూ మృదువుగా రమేష్ కళ్ళల్లోకి చూచింది చౌడీశ్వరి

"నల్లకోటువాడు రోజూ నీయింటికివచ్చి వెళ్ళేవాడు ఎవడువాడు?' ఇప్పుడింట్లోంచి వెళ్ళినవాడు ఎవడువాడు?" ఏకధాటిగా అడిగాడు

సున్నితంగా అతని భుజాలమీద చేతులు వేసింది సౌమ్యంగా, మృదువుగా, లాలనగా చెక్కిళ్ళమీద మునివ్రేళ్ళతో తాకింది

రమేష్ వళ్ళు జలదరించింది గగుర్పొడిచింది పులకరించింది వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి

శిశ్వన చలిగాలి రివట వచ్చింది

వళ్ళు మునగర దీసుకుపోయింది ఆమె రెండుభుజాలూ బలంగా పట్టుకున్నాడు రమేష్ పట్టలేని తమకంతో ఆమె పెదాలు ముద్దుపెట్టుకున్నాడు వేడి నిశ్వాసి

వాడీశ్వరిని దగ్గరకు లాక్కున్నాడు మెడచుట్టూచేతులు పెనవేశాడు షా! షా కొట్టినట్టు విదిలించివేశాడు దూరంగా జరిగాడు ప్రశ్నించాడు "ఎవడువాడు?"

"ఇంటి ప్లీడరు?" ఆమె జవాబు చెప్పింది అతని దగ్గరగా జరిగింది అతను దూరంగా పోలేదు

"అయితే ఎందుకొస్తున్నాడూ?" మెత్తబడ్డాడు మెల్లగా అడిగాడు

"ఆస్తి హక్కులు అన్నీ నాకివాళవచ్చాయి వచ్చినట్టే ఇన్నినాళ్ళనుంచీ ఆ ఏర్పాట్లు జరుగుతున్నాయి ఇవాళతో పూర్తయింది" ఆమె గంభీరంగా పలికింది తలగడక్రింద వున్న ఏవో కాగితాల కట్టతీసిచూపింది

"అయితే ఇవన్నీ ఏమిటి? రమేష్ ప్రశ్నించాడు," వాటివైపు చూస్తూ

"ఆస్తికి సంబంధించిన దస్తావేజులూ మొదలైనవి" కాగితాలు తలగడక్రింద భద్రంగా పెట్టింది

ప్రక్క గదిలో ఏదో శబ్దమయింది

"ఏమిటదీ?" నిర్లిప్తంగా అడిగాడు రమేష్

"ఏమో"అని పెద్దగా చెప్పి, వంటగదివైపు చూస్తూమరీ పెద్దగా,"వెధవ పిల్లులు"అనిలేచి పోయింది మళ్లీ తిరిగివచ్చింది

ఆ పైన కొంచెం సేపు గది నిశ్శబ్దంగావుంది

(5)

రమేష్ మాటలే నిశ్శబ్దాన్ని చీల్చివేశాయి అతను ప్రశ్నిస్తూనే నవ్వుతున్నాడు ఈ ప్రశ్నకు మాత్రం తను సమాధానం తెలుసుకు తీరాలి

"ఈ వేషమేమిటీ?"

ఆమె టపీమని జవాబుచెప్పింది– మృదువుగా "నీకోసం, నీ ఆనందంకోసం "అంటూ అతని మెడకు చేతులుచుట్టింది "ఇవాళనుంచి మనం అడ్డులేని "

"ఒక్కటుం" పూర్తిచేశాడు రమేష్ చౌడీశ్వరి చెక్కిలి స్పృశిస్తూ –

తలుపు తట్టిన ధ్వని

రమేష్ తత్తర పోలేదు

తలుపు తీసింది చౌడీశ్వరి

పడక మీాంచి లేచి కత్తి జేబులోచేయి పెట్టుకొని నిలబడ్డాడు రమేష్

"ఇంటివద్ద లేడు" బయటకంఠం

రమేష వింటున్నాడు ఎవరికోసం ఒంపిందో! మళ్ళా కోపం వస్తోంది

"వచ్చాడుతే" చౌడీశ్వరి సమాధానం

"రమేష్ కొంచెం తగ్గాడు

"రమేష్ వచ్చాడా?" బయట స్త్రీ కంఠం

"వచ్చాకులే నువ్వు పో" తలుపు గడియ వేసి వచ్చింది, చౌడీశ్వరి

పడకమీాద కూర్చుంటూ "ఎవరది" రమేష ప్రశ్నించాడు

"వంటమనిషి నిన్ను పిలుచుకురాను పోయింది ఇంటివద్ద లేవని వచ్చి చెబుతోంది" పడకమీద కూర్చుంది

"నేను కలకత్తా వెళ్ళలేదని నీకెలా తెలుసు" అనుమానంగా అడగాడు

"కలకత్తా రిజర్వు చేసిన మీ టికెట్టుమీద వంట దాని పింతల్లి కొడుకు వెళుతున్నట్లు తెలిసింది వాడీపాటికి కలకత్తాచేరి వుంటాడు! ముఖంలోకి చూస్తూ "అవునుకదూ?"

"అవును చేరివుంటాడు" ఆమెను చూస్తూ, నేనింటివద్దే వున్నట్లు నికెలా తెలిసింది" ముఖం దించుకున్నాడు

"నువ్వు మొదటి షోకివచ్చి, రూం కెళ్ళినట్లు, వంట మనిషి చెప్పింది"

"అది రెండో ఆట సినీమా కూడా చూచి నా దగ్గరకు వచ్చింది నీ విషయం చెప్పింది నిన్ను పిల్చుకురమ్మని పంపాను ఇంతలో నువ్వు వచ్చావు" ఆమె చెప్పటం ముగించింది

'అయితే నే నెప్పుడేం చేస్తుందీ నీకు తెలుసునన్న మాటా!" అనుమానంగా అడిగాడు అయితే అది ప్రశ్న

"ఆపైన ఇంకేమీ తెలియదు" ఏదో జవాబు ప్రశ్న కోరంది వుంది

రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడచిపోయాయి

రమేష్ చౌడీశ్వరిని హత్య చేయదల్చుకున్న కారణం ఆమె ముందు పెడుతూ సామాన్యంగా మొదలెట్టి ప్రశ్నిం

చాడు "చౌడీ ఇన్నాళ్లుగా నన్నెందుకు నిరసిస్తున్నావ్ ? ఎందుకు చౌడీ"

ఆమె హృదయంలోంచి మాట్లాడింది అనుకున్నాడు రమేష్ మెత్తగా, మృదువుగా, తియ్యగా "ఆస్తి నన పేరిట వచ్చిందాకా అదంతా తతంగం రమ్మీ" అతనితొడమీద మెడ పెట్టుకుంది

"చౌడీ" వెక్కిలిరాస్తూ "నిజం చెబుతున్నాను" ముఖంలోకి చూచి "నిన్నివాళ హత్య చేద్దామనుకున్నాను అందుకె వచ్చాను"

"హత్యా !" చౌడీశ్వరి అంది, రమేష్ తొత్తర పోయిందను కున్నాడు 'అవును' సమాధానం చెప్పాడు 'కాని నా హృదయాన్ని మార్చిన మగువ నన్ను మరో లోకంలోకి నెట్టేసింది' ముంగురులు సవరిస్తూ అంతా మరచి పోయాను

"నన్ను అన్యాయం చేస్తావా ?"

'ఇంకానా ?' ఆమె పెదాలను మృదువుగా స్పృశించాడు

'ఉండుండు! ఆగమంటే ?' ఆమె లేచింది రమేష్‌కు ఎదురుగా గోడమీద శృంగార రస స్వరూపిగా చిత్రించబడిన కాళికా దేవి పటం అలంకరింపబడి భయంకరమైన అందంగా కనిపించింది ఆమె వంట గది వైపు పోయింది

ఒక్క నిమిషంలో వచ్చింది

బయట వర్షం పడటంలేదు కిటికీలోంచి చలిగాలి దూకింది కురిసిన వర్షం నీటితో మురుగు కాలువ వొడ్డులు

వొరుసుకుంటూ పసిగెత్తుతోంది వెంటనే జేబులోంచి కత్తి
దీసి ముసుగు కాలువలోకి విసిరాడు

"బాబో" అంది చౌడీశ్వరి

"ఇక భయం లేదు చౌడీ" లైటు ఆఫ్ చేసి దగ్గరగా వచ్చి రెండు భుజాలు గట్టిగా పట్టుకొని పడక మీద కూర్చోబెట్టి, ప్రక్కనే కూర్చున్నాడు

ప్రక్క గదిలో ఏదో అలికిడి అయింది రమేష్ గమనించలేదు

ఆమె అతని ప్రక్కగా కూర్చుని ముద్దు పెట్టుకుంటూంది

ప్రక్క గదిలోంచి అలికిడి, మనిషి నడుస్తున్నట్లుంది వాళ్ళున్న గదిలోకి వచ్చినట్లయింది

రమేష్ ఏదో అలికిడి అనుకున్నాడు తలెత్తి ప్రక్కకు చూద్దామనుకున్నాడు చౌడీశ్వరి ముద్దుపెట్టుకుంటూనేవుంది 'చూడకపోతే ఏం?' అనుకున్నాడు రమేష్

ఆమె ఒక్కసారి పెద్దగా దగ్గింది

ఎవరో వ్యక్తి నడుస్తున్న శబ్దం సుకరంగా వినవస్తోంది

రమేష్ రెండు భుజాలమీద చేతులువేసి బలంగా ముద్దు పెట్టుకుంటూంది చౌడీశ్వరి

లేవబోయాడు ఆమె అతని భుజాల్ని వత్తి పట్టింది అతింకా ప్రయత్నం చేస్తూనే వున్నాడు

వంటగదినుంచి, హాలుదాటి, పడకగదిలోకి, మనిషి నడచి వస్తున్న సవ్వడి చక్కగా వినిపిస్తోంది రమేష్ లేవటానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు

రమేష్ రెండు చేతులు చౌడీశ్వరి మెడకుచుట్టాడు ఆమె సర్రున పైకి లేచింది విదిలించి వేసింది

కిటికీ తలుపు మూసింది కిటికీవైపు చూశాడు

తలుపు తెరుచుకుంది తత్తర పోయాడు తలుపువైపు చూశాడు వాడు—నల్లకోటువాడు వాడి చేతిలో కత్తి వుంది గుండెలకు గురి చూస్తున్నాడు

కిటికీ వైపు చూశాడు మూసివుంది చౌడీశ్వరి వికటంగా నవ్వుతోంది

తలుపు వైపు చూశాడు తీసివుంది తళతళల కత్తి వాడు తలుపు కడ్డంగా నిలబడి వున్నాడు ముందుకొస్తున్నాడు

చౌడీశ్వరి వికటంగా నవ్వుతోంది

నల్లకోటువాడు గుండెల మీది కొచ్చాడు

# రాగరేఖలు

బాబు చెల్లెలు విజయ

బాబుకి తల్లి లేదు తండ్రి ఏదో పట్టణం ఏమో ఉద్యోగం చెస్తున్నాడు

విజయకు తల్లి దండ్రులు వున్నారు ఏవో ఉద్యోగాలు ఎక్కడో చేసుకుంటున్నారు

బాబూ విజయా ఒక తల్లి పిల్లలుకారు

బాబు తండ్రికీ విజయ తల్లిదండ్రులుకీ పరస్పరం తెలియదు

కానీ—

బాబు చెల్లెలు విజయ

బాబూ, విజయా ఒకే కాలేజీలో చదువు కుంటున్నారు

బాబూ, విజయా ఒకరికొకరు తెలుసుగాని, ఆ వాస్తవం ఎవరికీ తెలియదు

విజయ చేయరాని పని చేసింది చేసేసింది చేయకూడనిది చేయటం జరిగిపోయింది

ఏ పని ఎందుకు చేయకూడదో ఎవరికోతప్ప అందరికీ తెలియదు ఏది ఎందుకు చేయాలో ఎవరికో తప్ప అందరికీ తెలుసు

మనుష్యుల్నిబట్టీ పరిస్థితుల్నిబట్టీ, చేయదగిన పనులూ చేయకూడనివీ ఏర్పడుతాయి

విజయ చేసిన ఈ పని బాబుకి ఇష్టంలేదు

ఇలా చేయటమె విజయకు ఇష్టమైవుంటుంది

అన్నయ్యకు తలనొప్పి తెచ్చే పని తలవంపులు తెచ్చే దుష్కర్మ చెల్లి చేసింది

తల దిమ్మెత్తి పోతూవుంటే ఏమీ ఆలోచింపలేక బాబు ఎనిమిదింటికే పడుకున్నాడు, హాస్టల్లో, తన గదిలో

శరీరము, బుర్రా పనిచేయకుండా సమ్మెచేస్తున్నట్లు బాధ పడ్డాడు

గుండెలు నిదానంగా, నిస్సత్తువుగా, నీరసంగా, మూలుగుతూ కొట్టుకుంటున్నాయి

మంచం మీద దొర్లాడు నిద్రపట్టటంలేదు వంటి మీద దుప్పటి నిలవటం లేదు

ఆలోచనలు ఎక్కువగావచ్చి బాధ పెడుతున్నాయి అంతు తేలక కష్టపెడుతున్నాయి

లేచి మంచం మీద కూర్చున్నాడు సిగరెట్లు చిత్తు చిత్తుగా కాల్చాడు

చెల్లి చేయకూడని పనిచేసింది

చేయకూడని పనుల్లోకూడా చేసిన పని మంచిదికాదు వర్రి చెత్తపని చేసింది చేసేసింది చెప్పకుండా చేసింది

ఎలా చెబుతుంది?

ఎల చెప్పాలి?

ఎందుకు చెబుతుంది?

ఎందుకు చెప్పాలి?
ఆమెనుగూర్చి వినటానికి తనెవరు ?
తను ఎవరని ఆమె చెబుతుంది ?
ఏం ? ఎందుకు చెప్పకూడదూ ?
అసలు ఎందుకు చెప్పాలి ?
చెల్లెలు తను ఏమి చేయబోయినా అన్నయ్యకు చెప్పాలి
విజయ తన కేలా చెల్లెలు ?
ఏమిటి చుట్టరికం ?
అందుకు హృదయం సాక్ష్యం
హృదయాలు న్యాయం నిర్ణయించే కోర్టులో పనికిరావు
అయినా—
చెల్లెలు తనుచేసే ప్రతిపనీ అందరికీ చెప్పక్కర్లేదు చెప్పదు
చెల్లి ఇష్టపడి చేస్తున్న తప్పుని కాదనటానికి అన్నయ్య కేమీ అధికారం లేదా ?
ఉంది
ఆమె ఇష్టాన్ని కాదనటానికి తనకేమి హక్కువుంది ? ఏముంది ? ఏమీలేదు ఏమీలేదా ? ఎందుకు లేదు ? ఏదో వుంది ! ఏమిటది ?
ఆమె తన చెల్లెలు
చెల్లెలు క్షేమం తను కోరుతున్నాడు
వాణ్ని ఏంచూచి ప్రేమించింది ?
(6)

వాడిలో ఏమంత మహా గొప్పతనంవుందని విజయ ప్రేమించింది ?

అసలు ఒకర్ని మరొకర్తె ఏంచూచి ఏం కోరి, ఏం ఆశించి, ప్రెమిస్తుంది ?

అందం !

కావచ్చు వాడందంగానే వుంటాడు

డబ్బు !

వాడికేం, డబ్బు పుష్కలంగా వుంది

హోదా !

డబ్బుతో వాడు యాచించి కొనుక్కున్న గౌరవం సలక్షణంగా వాడితో కాపురం చేస్తూ వుంది

చదువు !

వెర్రి మొర్రి చదువు ఏదో గుడ్డాడు కళ్ళు నులుము కున్న వెలగబెడుతున్నాడు

గుణం !

వాడిలో గుణం నిర్గుణమైన బ్రహ్మ పదార్థానికి తెలి యాలి వాడికి గుణమన్నమాటే తెలియదు

చెల్లి చెడ్డపని చేసింది

గుణం స్వరూపం నిర్ణయం చేయలేని వాణ్ణి ప్రేమిం చింది

అంతటితో ఆగలేదు

లోకంలో ఎంతమంది ఎంతమందిని ప్రేమించి నిర్వికా రంగా సంఘం ముసుగులో దాక్కొని వుండటంలేదు

ఈ విషయం ఇలా పరిణమిస్తోంది ఏమిటి ?

ఇప్పుడేం చేసేట్టు?

అసలు తనేం చేయగలడు?

వాడ్ని గురించివున్న వాస్తవాలు ఆవిడకు వివరంగా విషయాలు విడమర్చి చూపిస్తే!

ఈ విషయం చెబితే ఎలాంటి పరివర్తన వస్తుంది? వచ్చిన పరివర్తన పరిణామం ప్రవర్తన్ని ఎలా మార్చ గలుగుతుంది?

ఏమిటి చేయటం?

వాణ్ని పెళ్ళిచేసుకుంటానందట

పెళ్ళి జరిగితే కాపరం ఎలా గడుస్తుంది?

తనకెందు కీ బాధ?

చెల్లెలు ఒక బటాచోరతో ప్రేమ కలాపాలుసాగించి, పెళ్ళిచేసుకొని కాపరం పెట్టటం ఎలా సహించటం?

సహించక ఏం చేయాలి?

విజయ అందంగా వుంటుంది

— ఎవరినైనా ఆకర్షిస్తుంది

ఆరోగ్యమైన శరీరం

— వాడి కా శరీరం మీదే కోరిక

తెలివిగా చదువుతోంది

— ప్రతివాడ్ని కదిలించే లక్షణం

జడ బాగుగా, అందంగా, వుంటుంది

— వాడికి జడమీదే నిగా

ఆమె వాడ్ని ప్రేమించింది

వాడు విజయను కామించాడు వాడిది ప్రేమకాదు వాడు రాక్షసుడు

ఆమె గుణవంతురాలు

వాడి దగ్గర గుణం గిణం జాన్తా నై

ఏ యువకుడ్ని అయిన ఆమె ఆకర్షిస్తుంది

మూడు సంవత్సరాలనాడు తను మొట్టమొదట ఆమెను చూచినప్పుడు పిచ్చెత్తి, వెర్రిగా ఆలోచించాడు

ఇప్పుడు వాడు ప్రేమించినట్లు అప్పుడు తను విజయను ప్రేమించాడు

ఆమె నడకలో వంపులుచూచి, భ్రమించి, పుర్రె గోక్కొని, తను తల బ్రద్దలుకొట్టుకున్నాడు

ఆమె మాటలో మార్దవాల చిలుకులు, గొంతులో సౌకుమార్యంపు తరగలు, హృదయంలో పాల వెన్నెలమీది మీగడ తరకల తుంపర్లూ, ఒకనాడు తన హృదయ కవాటం మెల్లగా, మృదువుగా, లీలగా తాకాయి గుండె వీణను అల వోకగా మీటాయి

ఆమె పొంగులు వారే వయస్సు మిల మిలలూ, నిర్మల మైన మనస్సు తుషార జ్వలనలూ, నిలబెట్టి, ప్రశ్నించి, నిరుత్తరుడ్ని చేసేకళ్ళ కొనల కాటుక రేఖల సొగసు సోయగాలూ, తనని కబళించాయి కదిలించాయి చెక్కిలిగింతలు పెట్టాయి ముప్పిరిగొని ముసురు కున్నాయి

విజయకు వీడు తగడు

అప్పట్లో తను విజయకు తగుదు, ననుకున్నాడు బాబు

తన కొక భార్య కావాలి

ఆవిడ అన్ని సుగుణాలకు నిలయం కావాలి

అన్ని సుగుణాలకు విజయ ఆలవాలం

ఆమె తనకు భార్య అయితే తను ఆనందాబ్ధిలో మునకలు వేయగలడు

గాని ఈ భావం మారిపోయింది

ఈ మార్పు రావటానికి కారణం బాబు బలహీనత, అసమర్థత, కాదు

ఎలుగెత్తిన భావాలు, పడగ విప్పిన స్వార్థంలో ప్రసరించిన పరిస్థితులు, గతానికీ, భవిష్యత్తుకీ వర్తమానంలో మంగళ సూత్రం కట్టాయి

ఎప్పుడో బాబు మనస్సు మారింది

వాడు తగడు

విజయకూ వాడికీ తేడా చాలా ఎక్కువ

నీతీ నిజాయితీ లేని అలవాట్లు అన్నీ వాడికున్నాయి

వాడికి భార్య వుందిట

విడాకు లిస్తాడట

విజయను పెళ్ళిచేసుకుంటాడట

నో పెళ్ళి జరగటానికి వీల్లేదు

ము ను ప్ర

భార్య అయితే బాగుండుననుకున్న ఆలోచన మారిం తరవాత ,

విజయను చూచి పుణ్య, పవిత్రమైన, విచిత్రమైన, అపూర్వమైన అనుకోని క్రొత్త భావం కలిగింది

విజయ – తల్లి

తన హృదయం ఎందుకిట్లా మారింది? ఎందుకు మారకూడదు? మారకూడదని నియమం ఏమీ లేదు మారాలనీ ఆజ్ఞా లేదు ఎప్పుడు మానవుల హృదయాలు ఎలా మారుతాయో మారిందాకా మార్పు వచ్చిన మనిషికీ తెలియదు

తల్లి లేని పిల్లవాడికి అన్నం తినిపించింది

ముష్టివాడికి చొక్కా తొడిగింది

దిక్కు లేని పిల్లకి నేర్పుగా, ఓర్పుగా, పాఠాలు చెబుతోంది

భూమి సహనంవుంది

తల్లికి ఓర్పు వుంది

విజయకు సహనమూ, ఓర్పు సమపాళ్ళలో వున్నాయి

అందుకే "విజయ - తల్లి" అనుకున్నాడు బాబు

తన తల్లి చిన్నప్పుడే చనిపోయింది

తల్లి ప్రేమ, వాత్సల్యం, మాధుర్యం తనకు తెలియవు

తను విజయను ప్రేమిస్తున్నాడు

తల్లి స్థానంలో తను విజయను అప్పట్లో ప్రేమించాడు

ఆ అభిప్రాయం కూడా మారింది

విజయ - చెల్లి

ఓర్పుకి నిధి అయిన విజయకు పట్టి వెధవఅయిన వాడు వద్దు

విజయ పెళ్ళికి ఒప్పుకుందిట

ఎలా ఒప్పుకుంది?

ఏమి ఘోరకలి! అస్తవ్యస్తం! అసందర్భం, విపర్యస్తం



పరిస్థితి చేయి దాటి పోయింది

వాడు! వాడు!! వాడు!!!

దౌర్భాగ్య దామోదర చక్రవర్తి! నీచుడు, పోకిరీ, రౌడీ, శీలంలేని రాలుగాయి!

వాడు – విజయ – పెళ్ళి

ఏమిటీ అన్యాయం! అధర్మం! అక్రమం! అరాచకం!

పరిస్థితుల ప్రాబల్యం విలువల కొలతలు రూపం ఎలా వుంటుంది? మాట్ల్పుల కారణాలకు విజయ వివేకం ఏమయింది?

శాము తల్లి చనిపోయేసరికి చెల్లి రెండు నెల్ల పాప ఆపైన రెండు నెల్లకు తల్లి లేక, తల్లిపాలు పోషణ లేక, లోకం తో వేగ లేక ప్రపంచాన్ని చూడలేక చెల్లి చనిపోయింది

చెల్లి లేని తనకు విజయ చెల్లెలైతే బాగుండేది

బారుజడకో విజయ సన్నజాజులు కూర్చుకొనివచ్చింది కాలేజీకి

అందంగా వుంది

ఎవరో అన్నా చెల్లెలు లైబ్రరీచూచి వెళ్ళిపోతున్నారు

తన చెల్లెలు తన తో పాటు అలా నడుస్తూవుంటే ఎంత ఆనందం?

చెల్లివుంటే వీడిలాంటి పిరికివాణ్ని ప్రేమించేదికాదు

స్టేజీమీద ఏదో ప్రయిజు తీసుకుంది విజయ స్వంత చెల్లెలు అలా తీసుకుంటూవుంటే తను ఎంత సంతోషించేవాడూ?

విజయ పరిపూర్ణ వ్యక్తి

వాడు అడ్డగాడిద

ప్రేమకు ఎన్ని రకాల స్వరూపాలు వున్నాయో అన్ని రకాలుగా తను విజయను ప్రేమిస్తున్నాడు. ఆ విషయం తల్లితోగాని, చెల్లితోగాని, భార్యతోగాని పదే పదే చెప్పవలసిన అవసరం వుండదు. విజయను ప్రేమిస్తున్న తన హృదయాన్ని బంధించటానికి ఏ దెయ్యమూ ప్రయత్నం చేయదు. చేసినా ఫలితం వుండదు.

మొదట్లో విజయమీద తన ప్రేమ, ఆమెకు భార్య స్థానం ఇచ్చింది. ఆ పైన మారిన హృదయం కారణంగా మాతృ స్థానంలో చేర్చుకుంది. ఆ నుంచి అనుకూల వాతావరణంలో ఆమెను చెల్లిగా తలచింది.

విజయని తను పవిత్రంగా ప్రేమిస్తున్నాడు.

తన చెల్లికి తన యిష్టమైన వాణ్ని పెళ్లిచేయ గలిగే వాడు.

కాని విజయ విషయం అలా జరగలేదు.

పవిత్ర భారతనారీ లక్షణాలు మూర్తీభవించిన విజయ కర్కోటకుణ్ని నీచుణ్ని పాణిగ్రహణం చేసుకోబోతోంది.

ఇలా జరగటానికి వీల్లేదు.

తన హృదయం పగిలి పోతోంది.

హృదయం పెట్టే బాధకు కళ్ళు మూసుకొని కూర్చో గలిగే ఈ జడత్వం తనలో ఎందుకు ఊడలు దించుకుంటుందో అర్థం కాకుండా వుంది.

ఆ యి ఆత్మమీద విశ్వాసం, కర్తవ్యంమీద దీక్ష, కార్యసాధనలో ఆశయం పట్టుదలా కలిగివుంది.

ఆమె చేయబోయేది అసుగుణాలు మూర్తీభవించిన కార్యం

అదీ తనకు ఇష్టంలేదు

విజయకు ఇప్పుడు వయస్సు ఇరవై సంవత్సరాలు!

ఇరవై సంవత్సరాలనాడు చనిపోయిన అమ్మ తన యిరవై సంవత్సరాల వయస్సు అప్పుడు సరీగ్గా ఇప్పటి విజయ లాగా వుండేది

ఇరవై సంవత్సరాలనాడు చనిపోయిన చెల్లి బ్రతికి వుంటే సరిగ్గా నేటి విజయలాగా వుండేది

రేపు తనకు రాబోయే భార్యకూడా ఇప్పటి విజయకు ప్రతిమూర్తి కావాలి

తన హృదయం ఎగిరి పోతోంది చెల్లి చేయకూడని పని చేసింది

పడక మీద కూర్చున్నాడు బాబు

వాన కురిసినట్లు ఆలోచనలు

సినిమా ఆడినట్లు గతం కళ్ళ ఎదుట కదలికలు

వాణ్ణి చేసుకోవటానికి చెల్లి ఉదయం నిశ్చయానికి వచ్చింది అది బాబు హృదయంలో బాధలతరంగాలు రేపింది

సిగరెట్టు ముట్టించి కిటికీలోకి చూశాడు బాబు దూరం దూరంగా వుంటూవచ్చిన రెండు కొండలూ చీకట్లో కలసి ఏకమై పోయినట్లు బాధపడ్డాడు బాబు

"విజయ రిజిష్టర్ మేరేజి చేసుకుంది" ప్రక్క రూం వాడు ఎవరితోనో చెబుతున్నాడు

బాబు హృదయం పగిలిపోయింది

పడకమీద కూర్చున్నాడు

ఇవాళ కాకపోతే రేపైనా ఈపని విజయ చేసి వుండేది

పరిస్థితులకు తట్టుకోగలిగిన ఆమె ఒట్టుదలకు తలవంచు కోవలసిందే!

చెల్లిని క్షమించాలి! ప్రేమించాలి ఆమె పెళ్ళికి అశుభం పలకకూడదు నిందించకూడదు

దేవుడు మేలు చేస్తాడు!

ఇంతకీ

తను విజయని ప్రేమిస్తున్నట్లు ఎవరికీ తెలియదు

తను అసమర్థుడేమో!

ఏమో! కాకపోవచ్చు! కావూవచ్చు!

దీపం చుట్టూ చేరే పురుగుల్ని అన్నింటినీ వెలుగు గుర్తించుకోదు

విజయకు తను తెలియదు

వెన్నెల్ని వెక్కిరిస్తూ చూచే మారుమూల చీకటి అస్తిత్వం వెన్నెలకు తెలియదు

తను విజయకు తెలియదు

ఆకాశంలో ప్రయాణం చేసే సూర్యుణ్ని, చిన్ని గుడి దీపంకూడా ప్రేమిస్తుంది

తను విజయను ప్రేమిస్తున్నాడు

విజయకూ, తనకూ మధ్య ఎంత తేడా!

# నిశీదిని శంఖారావం

గూడ్సుబండి కునుస్తూ నడుస్తోంది

లోకంచుట్టూ చీకటి నగ్నంగా నృత్యం చేస్తోంది ఆకాశంలో చుక్కలు ప్రపంచాన్ని క్రమ్మిన అంధకారాన్ని చూచి గొంతెత్తి అరుస్తున్నాయి ఆ అరుపులు అర్థంలేని ధ్వనుల్ని నింపుకొని అనంతంలో మిళితమై పోతున్నాయి

గూడ్సుబండి కునుకుతూ కూతవేసింది

దూరంగా పర్వతం లోయల్లో కొండరాళ్ళను దాటుకుంటూ ప్రవహించే సెలయేళ్ళ ఏడ్పు, చిన్నగా, మరీచిన్నగా అవ్యక్తంగా వినవస్తోంది ఎందుకో నక్కలు, ఒక్కసారిగా ఎక్కడో అరుపులు మొదలుపెట్టాయి గుడ్లగూబలు కేకలు పెట్టాయి కీచురాళ్ళ మర్మర రవం వినవస్తూంది ప్రశాంత వాతావరణంలో ప్రకృతి వ్యతిరేకమైన ప్రతిపని ధ్వనీ వినవస్తూంది ఒక్క నిమిషం నిశ్శబ్దం పూర్తి నిశ్శబ్దం భరింపరాని నిశ్శబ్దం భయంకరమైన నిశ్శబ్దం ప్రళయమైన నిశ్శబ్దం ఇంతలో ప్రాణంమీదికి ముంచుకొచ్చినట్లు, ప్రపంచంపైన ప్రళయకాల మహాపయోధి వచ్చి పడుతున్నట్లు, గొంతువూపిరి ఆడక పోయినా, శక్తినంతా ఉపయోగించి, ప్రయత్నించి, చస్తున్న రాక్షసికంఠ భయంకరంగా, నిశ్శబ్దానికి భంగకరంగా గొంతు పెట్టి అరచింది గూడ్సు బండి

గూడ్సుబండి కొండ ఎక్కుతోంది

చుట్టూ దట్టంగా పెరిగిన చెట్లను దాటుకుంటూ సాగిన రైలు రోడ్డుమీద గూడ్సుబండి పైకి పాములాగా మెలికలు తిరుగుతూ ప్రాకుతోంది

గూడ్సుబండి ఇంజనులో డ్రైవరు గురవయ్య క్రూరంగా కనిపిస్తున్నాడు

ఇంజను పొయ్యిలోంచి, విచిత్రంగా, అపూర్వంగా కంపువచ్చి, నాసికా రంధ్రాల్ని ఎగలగొడుతోంది

గురవయ్యకు ముక్కు మూసుకోవాలని తెలియని పరిస్థితి డ్రైవరు ప్రక్కనున్న ఫైర్‌మన్ రెండుచేతులతో ప్రయత్నించి ముక్కు మూసుకున్నాడు

గురవయ్య వంటనిండా చెమట పట్టింది బట్టలు ముద్ద ముద్దగా తడిసిపోయాయి ఆ చెమట బట్టలపైన బొగ్గు నుసి కాటుక అద్దినట్లువుంది బట్టలు మరీ నల్లగా కనిపిస్తూన్నాయి ఆ బట్టలు పడిన నీరుగానీ, నెత్తురుగానీ గుర్తురానంత నల్లగా వున్నాయి

గురవయ్య పిడికిలి ముడుచకొని వుంది పళ్ళు నోటిలో ఒకదానినొకటి నొక్కి పట్టుకున్నాయి నొసటిమీద చిక్కు చిక్కుగా ముడతలు పడివున్నాయి నొసటిమీద చెమట బిందువులు తళతళ లాడుతున్నాయి ముఖంలో వెలుగు నీడలు వ్యాపిస్తున్నాయి గురవయ్య ముఖంమీద సాలెగూడు లాగా వెలుతురు మండుతున్న పొయ్యిమూత కన్నాలలోంచి వచ్చి పడుతోంది ముక్కుపైగా చెమటబిందువులు జారుతున్నాయి కనురెప్పలు చెమటతో తడిసిపోయాయి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మందంగా సాగుతున్నాయి ముక్కుపుటాలు

కంపిస్తున్నాయి కఠినమైన అధరాలు వణుకుతున్నాయి ముఖం లోని ప్రతీ సెంట్రుక పాశు కంపరం చుట్టిపోతోంది

గూడ్సు బండి కొండ ఎక్కింది

గురక పెడుతూ గాలి తోలింది

గాలి విసురికి ఇంజనుపొయ్యి చలించింది పొయ్యి లోంచి ప్రక్కలికి వెళ్ళ తెలియకపోతే పుట్టినగాలి బైటికి వచ్చింది ఆ గాలిచక్కగా బ్రతుకుతూ వాసన మోసి తెచ్చింది

కంపు! ముక్కులో రక్తనాళాలు పగిలపోయే కంపు శ్మశానంలో మనిషి కాలుస్తుంటే వచ్చేకంపు

గురవయ్యకు ముక్కు మూసుకోవాలని తెలియద ముక్కు మూసుకున్న ఫైర్ మన్ గూడ్సుబండి నడుపుతున్నాడు ఎర్రని గాజుగోళీల్లాంటి రక్తం గడ్డకట్టినకళ్ళలోంచి చూపులు నిర్వ్యాపారంగా మండుతున్న పొయ్యివైపుసూటిగా విసరాడు

గురవయ్య ఆలోచనలులాగా పొయ్యిలో సుడులు తిరుగుతున్నాయి పొగలు ఆ పొగల్లో అంతకు ముందు జరిగి పోయిన విషయం గుర్తుకొచ్చింది పొయ్యిలోంచి వచ్చే వాసనకు, అంతకుముందు జరిగిన సంఘటనకు సంబంధం అతని ముఖంలో తేలుతోంది

అంటకు కొంచెం ముందు

గూడ్సుబండి కొండకు రెండు మైళ్ల దూరంలో దట్ట మైన అడవిలోంచి నడిచింది

అప్పుడు

భూమిమీద చీకటి పెత్తనం మమ్మురంగా చెలాయి స్తోంది మిణుగుపురుగులు వెలుగునిద్దామని ప్రయత్నించి,

వచ్చి, కిక్కురుమనకుండ వృ కున్నాయి చీకటి సింగారించుకొని చిత్రంగా నవ్వి నగ్నంగా, భీకరంగా, నర్తిస్తూ వర్తించింది అంతలో

గుబురుగావున్న కొండ దగ్గర అడవిలో చెట్ల మధ్యగా ఒక అరుపు వినవచ్చింది మార్మోతలు వినిపించాయి దశ దిశలూ ప్రతిధ్వనించాయి నాశనమయిన ఏకాకి అరుపు కాదు నడుం విరిగిన ఏనుగు ఘీంకారం కాదు కాలుగమూడిన కుక్క అరుపు కాదు చిక్కిపోయిన సింహగర్జన కాదు చీకట్లో సిగ్గుతో తలొంచుకుపోయే రైలింజను కూతకూడాకాదు అన్నిటికీ అతీతం అర్థంగాని ధ్వని ఊహించ లేని శబ్దం

—మనిషి చావబోయేముందు చివరి సారిగా, ఉన్నతమైన స్వరంతో పెట్టే గావుకేక

అనుకున్నట్లు గూడ్సుబండి మెల్లగా నడిపాడు గురవయ్య గూడ్సుబండి వెలుగులో రైలురోడ్డు ప్రక్కగా ప్లాట్‌ఫాం గుదూరంలో ఎవడో ఏదో ఎత్తుకొని నిలబడ్డాడు గురవయ్య అనుకున్నాడు ఇంజను ప్రక్కగా మూడో మెట్టుమీదికి దిగి

క్రింద నిలబడినవాడు అందించిన బరువు అందుకున్న గురవయ్య వెంటనే ఇంజనుపొయ్యి మూతతీసి, దాంట్లో నెట్టి, బొగ్గువేసి, మూతవేశాడు బట్టలమీద రక్తం పడింది ముఖంలో ఆతృతపోయింది, శరీరానికి చెమటపట్టటం మొదలు పెట్టింది అప్పుడు తను బైటికిచూశాడు అందించిన బాబు గూడ్సు గార్డుపెట్టె దాటకముందే కనిపించకుండా అడవిలోకి వెళ్ళిపోయాడు బాబు వెళ్ళిపోవటం తను చూడలేదు

గూడ్సుబండి కొండదాటి లోయలోకి దిగుతోంది

భోరున గాలి తోలింది కంపు! సహించరాని కంపు కండలు కాలిన కంపు నరాలు మాడిన కంపు వెంట్రుకలు పొటమరించే కంపు

పొగలు పొరలుతున్న పొయ్యిమూత తీశాడు గురవయ్య లోన శవం కాలిపోతోంది పూర్తిగా కాలిపోలేదు గుర్తుపట్టటానికి మాత్రం వీలులేదు ఊచల్లాంటి చేతులు, కట్టెల్లాంటి కాళ్లు, ముడుచుకుపోయిన దుంగలాంటి శరీరం రాయిలాంటి తల నగిలిపోయింది అన్నీ మండుతూనేవున్నాయి ఉమ్మివేశాడు తుపుక్కున గురవయ్య

బొగ్గువైపు చూశాడు పొయ్యివైపు చూశాడు బొగ్గు పొయ్యిలోవేశాడు శవం చాయలు కనిపించకుండా చేశాడు బొగ్గు పూర్తిగా పొయ్యిని క్రమ్మింది పొగలు దట్టంగా వస్తున్నాయి మూతవేశాడు గురవయ్య

డ్రైవరు దూరంగా నిలబడ్డాడు ఫైర్‌మేన్ ఇంజను నడుపుతున్నాడు గురవయ్య చెమట మెల్లగా చల్లారుతోంది బట్టలు బొగ్గుతో, రక్తంలో, చెమటలో తడిసి నల్లగా తయారయ్యాయి ముఖం చిత్రంగా మార్పులు పొందుతోంది పైపంటిక్రింద క్రిందపెదిమ నొక్కబడింది కళ్ళు చిన్నవయ్యాయి ముఖం కుంచించుకుపోయింది

గూడ్సుబండి లోయలో పోతోంది

ఇంజను పొయిలోంచి పొగలు సుడులు సుడులుగా కంపు కంపుగా వస్తున్నాయి

కంపుకీ—ఇంజను పొయిలోంచి రావటానికీ కారణాలు అతని ఆలోచనల్లో కదలాడుతున్నాయి

ఎధవ మాడిపోతున్నాడు, అనుకున్నాడు గురవయ్య మళ్ళీ అనుకున్నాడు తప్పుడు బుద్ధులున్న వాళ్ళు బ్రతకూడదు

బాబు మంచివాడు తనమాట విన్నాడు తనుచేయమన్న పనిచేశాడు వాడు తనని ఎప్పుడూ కాదనలేదు అసలు బాబు అచ్చంగా తనకొడుకు తండ్రికి తగిన కొడుకు అందరిలాంటివాడు కాదు

పొయ్యివైపు చూశాడు

కాలుతున్నాడు వెధవ అసలు వాడెవడో తనకు తెలియదు పెళ్ళాం తన తరుపు చుట్టమని చెప్పింది తన పెళ్ళాన్ని వాడు అక్కా అని పిలిచేవాడు

వాడు—కోటిగాడు—తన కింత ద్రోహం చేస్తాడని తను అనుకోలేదు ఏదో లేనివాడుకదా అని తను వాడికి స్టేషనులో కూలీ మోసుకునేందుకు లైసెన్సు ఇప్పించాడు వాడు ఇంత ద్రోహం చేస్తాడా ?

వాడువచ్చి సరిగ్గా సంవత్సరంకూడా కాలేదు ఇంతలో ఎంతపని చేశాడు ఎంతద్రోహం ఇంతగా ప్రవర్తిస్తాడని తెలిస్తే తాను వాణ్ణి చేరనిచ్చేవాడుకూడా కాదు

వాడికి తను బుద్ధి బాగా చెప్పాడు

బాబు లేకపోతే కోటిగాడికి తను శిక్ష వేయగలిగేవాడు కాదు బాబు సహాయం చాలా వుంది బాబుది ఆరోగ్యమైన శరీరం కోటిగాడిదకూడా అంతే ఇద్దరి వయస్సూ ఇరవై సంవ

త్సరాలకు మించదు ఇద్దరి శరీరాలూ బొద్దుగానే వుంటాయి ఇద్దరి ముఖకవళికలు దగ్గరదగ్గరగా ఒకేలాగ వుంటాయి జాగ్రత్తగా చూస్తేతప్ప పోల్చుకోలేము

ప్యాసింజరు ట్రయిన్లో ఫైర్ మన్ గా పగలు డ్యూటీ చేసివచ్చి పడుకున్నాడు బాబు వాడి పడకలోనే కోటిగాడు కూడావున్నాడు రాత్రి ఒంటిగంట కి తను డ్యూటీకివస్తూ బాబుని లేపి చేయవలసిన కార్యక్రమమంతా చెప్పి, తను ఇంజనుదగ్గరికి వచ్చాడు రాత్రి ఒంటిగంటకల్లా కార్యక్రమం నెరవేర్చాడు బాబు వాణ్ని చంపి ఇవ్వమని తను బాబుతో చెప్పాడు అలాగే బాబుచేశాడు తను ఆ వెధవ కోటిగాణ్ణి ఇంజనుపొయ్యిలో వేసి బూడిదచేసి వేశాడు

పొయిలోంచి సన్నగా వాసనవస్తోంది

మాడిపో! బోడి ధవా! ద్రోహం చేస్తావటరా అనుకున్నాడు తను ఫైర్ మను నడుపుతున్నాడు, ఇంజను

గూడ్సుబండి కొండప్రాంతంలోనే నడుస్తోంది

గురవయ్య పొయ్యివైపు చూశాడు

కోటిగాడు తనకింత అన్యాయం తలపెడతాడని తెలిస్తే తను వాణ్ణి చేరనిచ్చేవాడుకాదు ఎంత అప్రతిష్ఠ, ఎంత అపకీర్తి తన గౌరవానికీ హోదాకీ మచ్చతెచ్చే పనిచేస్తాడా వాడు చావరా వెధవా అనుకున్నాడు గురవయ్య పొయ్యివైపుచూస్తూ

—కృతజ్ఞత లేని ఒక వెధవకి ఉద్యోగం చూపించటం తనది తప్పు తనది బుద్ధిలేనిపని తను వెధవ వర్రి వెధవ

వెర్రివెధవ వాడికి తను లైసెన్సు కూలీ ఉద్యోగం ఇప్పిం
చాడు

ఒకప్పుడు తనుకూడా లైసెన్సుకూలీయే ఇప్పటికిపాతిక సంవత్సరాలనాడు తను లైసెన్సుకూలి అప్పుడు తనకి పది హేను సంవత్సరాలు తనకు కూలీ మోయటానికి లైసెన్సు లేదుగాని తను కూలీ మోసేవాడు అప్పుడు

తనకు తల్లిదండ్రు లెవరో తెలియనప్పుడు తను స్టేష నులో చేరాడు

ఇంజను పొయ్యిలోంచి వాసన వస్తూనేవుంది
ఫైర్‌మన్ బండి నడుపుతూనే వున్నాడు
గూడ్సుబండి గునుస్తూ నడుస్తూవుంది
గురవయ్య ఆలోచనలు సాగుతూవున్నాయి

రైలుస్టేషనులో తన జీవితం పది సంవత్సరాలనాడు ప్రారంభమయింది అంతకుముందు తనెవరో తనకు తెలియదు లోకానికి అంతకంటే తెలియదు కూలీ నాలీ మోసేవాడు ప్రయాణీకులదగ్గర డబ్బు లడుక్కునేవాడు ఎవరు ఏం పెట్టినా తీసుకొనేవాడు ఎక్కడో ఎత్తేసిన పుల్లాకుల్లో మెతుకులు తినే వాడు ఏ ప్లాటుఫారం మీదనో, ఏ లైటుకిందనో, ఏ ఫెన్సింగు ప్రక్కనో నిద్దరపోయేవాడు

కూలీ మోసేటప్పుడు చూచిన లైసెన్సు కూలీల తిట్లు తిన్నాడు తన్నులు భరాయించాడు ప్లాటుఫారం మీద పోలీసుల అదమాయింపులకు తట్టుకున్నాడు అనేక సంద ర్భాల్లో దొంగని అనుమానించి తన్నేటప్పుడు తమాయించు కున్నాడు దున్నపోతులాగా వున్నావనే దున్నపోతుల్లాంటి

ప్రయాణీకుల బెదిరింపులకు ఓర్చుకున్నాడు ఘరానామనుష్యుల చేతుల్లో కిక్కురుమనలేదు

— నూరు సంవత్సరాల కష్టాలు తను చిన్నతనం లోనే అనుభవించాడు కన్ను మూస్తూ తెరుస్తూ లోకంవైపు చూడకుండ జోగుతూ కాలంగడిపే తనకు కనువిప్పు కలిగించింది లోకం దాంతో ఎన్నడూ లేని క్రూరతత్వం తనలో కూడా పీఠం వేసుకుంది

ఒకసారి కూలీకి అడ్డంవచ్చిన ఒకణ్ని పచ్చడి పచ్చడిగా చితగ్గొట్టాడు ముఖం పగలగొట్టాడు నగుం విరగదన్నాడు రక్తం కళ్ళచూశాడు

మరొకసారి తను ఏరుకునే పుల్లాకుల్లో మెతుకులు లాక్కుపోయిన మరో కణ్ణి చింతకాయ చట్నీచేశాడు పళ్లు రాలగొట్టాడు దవడ పగలగొట్టాడు కసి తీర్చుకున్నాడు

తను పాయిఖాన దొడ్డిదగ్గర, లైటుకి దూరంగా, క్రీనీడన జీవితంలోని మురికిని పీల్చుకొంటూ, యాతల్ని విడుస్తూ నిద్ర పోతుంటే తన ప్రక్క కండువా కాస్తా ఆ రాత్రి లాక్కుపోయిన వాడిని తెల్లారింతరవాత చావబాది కోపం చల్లార్చుకున్నాడు తను

ప్రపంచం తనకప్పుడు అందించిన మహాప్రసాదం క్రూరత్వం మూర్ఖంగా ప్రవర్తించటం, పరిస్థితులమీద బలంగా మరో త్రోవలో అడ్డదిడ్డంగా, ఆలోచన లేకుండా ఎదురొక్క నేట్టు చేయటం

ఆ క్రూరత్వానికి పరాకాష్ఠ వచ్చిపోతున్నాడు -ధవ మూర్ఖంగా మూర్ఖత్వంమీద తిరగబడి నిలువలేక మిడతలాగా మాడిపోతున్నాడు

నాకు ద్రోహం తలపెడతాడ ద్రోహి అనుకున్నాడు గురవయ్య ఇంజను పొయ్యి మండిపోతూనేవుంది

కొంచెం కొంచెంగా వాసన ఇంజన్లో కొడుతోంది

గూడ్సుబండి నడుపుతున్న ఫైర్‌మన్ తీగ లాగేసరికి ఇంజను కూతవేసింది దూరంగా ముసుగదీసుకు పడుకున్న కొండ నల్లదుప్పట్లో నిశ్శబ్దంగా నిద్రపోయే నిశీథి ఒక్కసారి ఉలిక్కిపడి లేచి ఆవులించి వూరుకున్నది

కోటిగాడి కిప్పుడు ఇరవై సంవత్సరాలు తనకప్పుడు పదహారు పదిహేడు సంవత్సరాలు వయస్సు ఆ రోజు తను ఎవరిదగ్గరో కూలీ అందుకొని మోసుకొని పోతున్నాడు అంతలో లైసెన్సు కూలీవచ్చి, కాలితో వీపుమీద తన్ని, నెత్తి బరువు మార్చుకొని, గుండెల్లో కొండలగుబులు విడిచి, పోతూ పోతూ 'దున్నపోతు! పోయి బొగ్గు మోసుకోరాదు' లైసెన్సు కూలీ ధర్మబోధచేసి వెళ్ళిపోయాడు,

ఒకనాడు మరొకడికీ తనకీ కూలిసంపకందగ్గర పేచీ వచ్చి తగాదాపడి తన్నుకుంటుంటే స్టేషనుగార్డు వచ్చి, వీపు చరిచి విడదీసి, నానా చివాట్లుపెట్టి, 'వెధవల్లారా! పనీపాటా లేకుండ తన్నుకోకపోతే పోయి బొగ్గు మోసుకోరాదటండ్రా' అని వెళ్ళిపోతున్న గార్డువేపు తను పరుగెత్తి 'బాబ్బాబు ఎక్కడబాబు బొగ్గుమోసేది' అని అడిగి తెలుసుకున్నాడు

మరునాడు తెల్లవారకముందే మసక చీకట్లోనే, లోకో షెడ్ దగ్గరకుపోయి మేస్త్రీని కలుసుకొని, తను బొగ్గు మోస్తానని మనవి చేసుకున్నాడు మేస్త్రీ తనవైపు దృష్టి సారించి తీక్షణంగా చూశాడు తను కండలుబ్బించి నరాలు బిగబట్టి ఒళ్ళు పనిచేయగలదనే అభిప్రాయం కలిగేట్టు చేసే ప్రయత్నం కొనసాగిస్తూ వినయంగా నిలబడ్డాడు

మేస్త్రీ ముఖంలో ఆనందం కనిపించింది తను తృప్తిగా గాలి పీల్చుకున్నాడు మేస్త్రీ అడిగాడు 'బొగ్గు మోస్తావా' అని తను మాట్లాడలేదు బుర్రమాత్రం, గట్టిగా, మాంఛి ఊపుతో రెండుసార్లు అటూ ఇటూ ఊపాడు

గూడ్సుబండిలో నిలబడి గతం కళ్ళెదుటకు తెచ్చుకుని చూచుకుంటూ ఆలోచనల్లో లీనం అయిపోయిన గురవయ్య వీపుకి ఇనప రాడ్ ఒకటి గట్టిగా పొడుచుకుంది

వెనక్కి తిరిగి చూశాడు గురవయ్య

ఫైర్‌మెన్ ఇంజను పొయ్యిలో బొగ్గు వేసి, బొగ్గుని కదిలిస్తున్నాడు ఆ కదలికతో రాడ్ రెండోభాగం అనుకోకుండా గురవయ్యకు పొడుచుకుంది ఆలోచనల గొలుసు తెగిపోయింది కోపం వచ్చింది ఫైర్‌మన్ డ్రైవర్ వైపు చూడకుండ కూడ పనిలో నిమగ్నుడై పోయాడు గురవయ్య కోపం పోయింది ఫైర్‌మన్ ఇంజనుపొయ్యిలో బొగ్గువేశాడు

గురవయ్య ఆలోచనలు బొగ్గువైపు మళ్ళాయి

తను లోకోషెడ్డులో బొగ్గుమోసేవాడు మొదట్లో, మేస్త్రీ సహాయంతో షెడ్డులో పనిలోచేరినప్పుడు వ్యాగన్లలోంచి దిగుమతైన బొగ్గు వేరొకచోట చేర్చటం కొన్నాళ్ళు

చేశాడు తరవాత వాగన్లలోంచి బొగ్గుదించటం కొన్నాళ్ళు చేశాడు క్రిందవున్న బొగ్గుని ఇంజన్లో వేయటం మరికొన్నాళ్ళు చేశాడు ఇలా సంవత్సరం గడిచిపోయింది

ఏదో అవసరమైన సందర్భంలో ఇంజను ఫొయ్యిలో బొగ్గువేయవలసిందని మేస్త్రీ చెప్పి పంపించాడు తను అలాగ్గా కొంతకాలం గూడ్సుబండిలో ఫొయ్యిలో బొగ్గు వేస్తూవుండే వాడు మరికొంత కాలానికి తనని ఫైర్‌మన్ అన్నారు అప్ప ట్నుంచి తనకు వారం జీతంకాదు నెలజీతం

అప్పుడు తను ఫైర్‌మన్ అప్పట్లో తను ఫైర్‌మన్ అదే మొదలు తనలో తనుకూడా ఒకవ్యక్తి అని భావం రావ టానికి తనకు వ్యక్తిత్వంవుంది

అంతకుముందు తను రిక్షావాళ్ళు తినే సీతి హోటల్లో నాలుగు మెతుకులు కతికేవాడు ఓవర్ బ్రిడ్జీమీద ఎక్కడో నిద్రపోయేవాడు అయితే పరిస్థితి తారుమారయింది పగలు నిద్రపోవాలి రాత్రి డ్యూటీకి పోవాలి వేళగానివేళ అన్నం తినాలి ఇదీ పరిస్థితి ఇది విషమ పరిస్థితి తనకు ఓవర్ బ్రిడ్జి మీద పగలు నిద్రపోవటం చచ్చినా కుదరదు అనుకున్నప్పుడు అన్నం దొరకదు

మేస్త్రీకి మగపిల్లలు లేరు ఒక్కతే ఆడపిల్ల తను మేస్త్రీని అడిగాడు పరిస్థితి వివరించి చెప్పి మేస్త్రీ తెలుసు కున్నాడు ముద్దుగా పిలుస్తూ 'నా యింటో వుండు బాబు' అన్నాడు మేస్త్రీ భార్య ఒప్పుకుంది తను మేస్త్రీని ననుస రించాడు

నాగిపోతున్న గూడ్సుబండి పొయ్యిలో వాసనలేదు గురవయ్య పొయ్యినైపు చూశాడు

పొయ్యివైపుచూస్తూ వీడికి— కోటిగాడికి తను ఆశ్రయం ఇచ్చాడు వీడు తన యింటికవచ్చి సంవత్సరం కావస్తోంది తను మెస్త్రీ ఇంట్లోచేరి ఇరవైసంవత్సరాలపైగా అవుతుంది

వీళ్ళు మేస్త్రీ దూరం చుట్టం లైసెన్సుకూలిగా స్టేషనులో చేరాళ్ళు ఉంటానికి ఇల్లు లేకపోవటంతో తన యింట్లో చేరాడు తను చేరనిచ్చాడు ద్రోహం అని తెలియదు తెలిస్తే చేరనిచ్చేవాడు కాదు

తనకిప్పుడు నలభై సంవత్సరాలకు పైచిలుకే వుంటుంది వయస్సు ఇప్పుడు తనకొక కొడుకు, కూతురూ వున్నారు కోటిగాడికి ఇరవై సంవత్సరాలు బాబుకి ఇరవై సంవత్సరాలు కూతురికి పద్దెనిమిది సంవత్సరాలు తను మేస్త్రి ఇంటిలో చేరినప్పుడు మేస్త్రీ కూతురికి పద్దెనిమిది సంవత్సరాలు

గూడ్సుబండి ఇంజను తెంపులేకుండా కూతలువేస్తోంది

గురవయ్య ఆలోచనలకు అంతరాయం కలిగింది

పైర్‌మన్ బైటికి చూస్తూ తీగె లాగుతూ వున్నాడు గురవయ్య బైటికి చూశాడు దూరంగా కొంచెం ఎత్తులో ఎర్రలైటు కనిపిస్తోంది సిగ్నలు ఇవ్వలేదు మరి రెండునారులు తీగెలాగాళ్ళు ఫైర్‌మన్ దూరంగావున్న ఎర్రలైటు పచ్చ లైటుగా మారింది సిగ్నలు వంగి వుంటుంది

కూతెలువేసాని గూడ్సుబండి, సిగ్నలు దాటి స్టేషను లోకివచ్చింది స్టేషను చాలాచిన్నది ఆగలేదు దాటిపో యింది

గురవయ్య గతం జ్ఞాపకాల సినిమా రీలు వర్తమానంలో గుర్తుకు తెచ్చుకొని చూచి ఎదురుగావున్న పొయ్యిలో తగవేస్తునాడు

అప్పుడు తనని మేస్త్రి భార్య 'బాబూ రేరా' అని లేపేది స్నానం చేయించేది బట్టలు ధరింపించేది అన్నం పెట్టేది డ్యూటీకి పంపేది తను డ్యూటీకి పోయేవాడు తను ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడేవాడుకాదు కాదు —తను అసలు మాట్లాడేవాడకాదు ఎవరిఎదుటా నిల బడేవాడుకాదు అసలు అవసరం కలగేదేకాదు పిలిస్తే తల వంచుకొనే పలికేవాడు ఏమైనా అడిగితే తలవంచుకునే సమాధానం చెప్పేవాడు

వీణ్ణి కూడా తనభార్య గౌరవంగా చూచేది ఏలోపం రానీకుండా చేసేది వాడు ఎప్పుడు ఎక్కడ వుండేవాడో ఎవరికీ తెలియదు ఒకరోజు స్టేషనులో పడుకునేవాడు మరొకరోజు ఇంట్లో పడుకునేవాడు వాడు ఎప్పుడు కూలీమోసేవాడో తెలియదు డబ్బుమాత్రం ఏదో ఇంత తనభార్యకు వాడు ఇస్తూ వుండేవాడు

అప్పుడు తనకు ఇరవైసంవత్సరాలు నిండాయి ఆ ప్రాంతంలోనే క్రొత్తగా గూడ్సుబండి వేశారు డ్రైవర్సుస్టేట్ తగ్గింది ముగ్గురు డ్రైవర్లు అవసరమై యారు సర్వీసున్న ఫైర్‌మన్లను డ్రైవర్లుగా ప్రమోట్ చేసేపర్పాటు జరిగింది తనకు ప్రమోషన్ వచ్చింది అంతే మళ్లీ ప్రమోషన్‌లేదు కారణం తనకు చదువులేకపోవటం అప్పట్నించి ఇప్పటిదాకా తను గూడ్సుబండి డ్రైవరుగానే వుండిపోయాడు

వీడికేమీ ప్రమోషన్ లేదు ఒకేబొక్క ప్రమోషన్, దేవుణ్ణి చూస్తున్నాడు కోడిగాడు

తను డ్రైవరు అయింతరువాత కొంత విశ్రాంతి దొరకటం మొదలుపెట్టింది తను ఇంటిదగ్గరవుండే అవకాశంఎక్కువ చిక్కింది అదే తనకు మేలుచేసింది జీవితం బాగుపడేట్టు చేసింది

కోటిగాడు కూడా ఆ మధ్య ఇంటిదగ్గర ఎక్కువకాలం వుండటం మొదలుపెట్టాడు తనకప్పుడే భయం కలిగింది వాడికున్న ఆ విశ్రాంతే తనకు కష్టం కలగించింది వాడికొంప ముంచింది తనకు కోపం తెప్పించింది వీణ్ణి తన చేతులతో చంపించింది

—వెధవ స్వర్గంలో రంభతో తతంగాలూ తైతక్కలూ ఆడుతాడులే కుక్క ఛీ! ఇంజన్లోంచ ఉమ్మివేశాడు

మేస్త్రీకి రోజువిడిచి రోజు రాత్రి డ్యూటీవుండేది మేస్త్రీ భార్య పదిగంటలకే కునుకుతీస్తుంది తనకు రాత్రి రెండు గంటలదాకా నిద్రపట్టేదికాదు ఇంటిదగ్గరున్నరోజుల్లో మేస్త్రీ "ఏం బాబూ ఇంకా నిద్దరపోలేదూ" అని అడిగేవాడు తను ఏ సమాధానమూ చెప్పేవాడుకాదు "పిచ్చి బాబు ఏమాలోచిస్తున్నాడో" అనుకుంటూ వెళ్లిపోయేవాడు పిచ్చి మేస్త్రీ

తనకు విశ్రాంతి ఎక్కువైనా రాత్రిడ్యూటీకూడా ఉండేది కొడుక్కికూడా ఎక్కువగా నైట్ డ్యూటీలు వస్తుండేవి తన

భార్య పదిగంటలకు పడుకుంటుంది వాడు ఎప్పుడు ఎక్కడ పడుకునేవాడో ఎవరికీ తెలియదు! ఏరా ఎక్కడున్నావంటే ఏమీ చెప్పేవాడు కాదు

– వెధవ తనకు తెలియకుండా చేయగలడా! అనుభవించరా అప్రాచ్యపు ఫూల్ క్రాంద్రించి మండేపొయ్యిలో ఉమ్మివేశాడు డ్రైవరు

మేస్త్రీకి ఒక కూతురుంది అప్పుడుదానికి పద్దెనిమిది సంవత్సరాలు, లోకోషెడ్డు చుట్టూ చిన్నచిన్న బొగ్గులేరి కాఫీహోటళ్ళలో అమ్ముతూవుండేది పెట్రోలు, కిరోసిను దిగుమతైనప్పుడు పనికిరాని ప్రతిబొట్టు గుడ్డతో అద్ది, ఆ గుడ్డ డబ్బాలో పిండుకొని దాన్ని అమ్మి డబ్బు సంపాయించేది వాగన్లులోంచి కట్టెలు దిగినప్పుడు దొంగిలించి అమ్మి, డబ్బు కూడబెట్టేది మేస్త్రీముఖం చూచి, ఆపిల్లను చూచీ చూడనట్లు పోనిచ్చేవాడు కాపలాదారు ఆపిల్ల నడుస్తుంటే షెడ్డు కాపలా జవాను నోరు చప్పరిస్తూ డ్యూటీ మరచిపోయేవాడు

తనకూ ఒక కూతురేడిసింది దానికిప్పుడు పద్దెనిమిది వెండాయి అది విలువలేనిపిల్ల తను దానికి గౌరవం, తెద్దామని గొప్పవాడికిచ్చి పెళ్ళిచేద్దామనీ కలలుకన్నాడు తను దాన్ని ఎక్కడకూ ఎప్పుడూ పోనివ్వకుండా, అన్నీ ఇంట్లో ఏమర్చేట్టు చేశాడు చివరకు అర్థంలేనిపని చేసింది వెధవ కోటిగాడు దాన్నిచూస్తే ఏపనీ చేసేవాడుగాదు

మేస్త్రీ కూతురు, మేస్త్రీ నైట్‌డ్యూటీకి పోయినప్పుడు ఒంటి గంటా రెండు గంటలదాకా నిద్రపోయేదికాదు తెల్లవారుజాము నాలిగింటికె లేచి, ఆపనీ ఈ పనీ చేసేది

తన కూతురు, బాబూ తనూ' నైట్‌డ్యూటీకి పోయి పగలు నిద్రపోతుంటే అదికూడా ప్రక్కనే చేరి వళ్ళుమరచి నిద్రపోయేది

కూతురు నలతగా వుంటోందని విచారించిన మేస్త్రీ, దాన్ని ఎక్కువగా పనిచేయనివ్వటం లేదు కూతురు చురుగ్గా పనిచేయటం లేదు కాని, తీర్చిదిద్దిన గుమ్మటంలాగా, బొద్దుగా శుభ్రంగా కొంచెం చిర్యాబట్టి నున్నగా, నిగనిగలాడుతూ అందంగా తయారవుతోంది ఆతరువాత రెణ్నెల్లకు తెలిసింది మేస్త్రీకి, కూతురికి నెలలు నిండుతున్నాయని

రెండురోజుల క్రిందట తనకు తెలిసింది, తనకూతురికి నెలలు నిండుతున్నాయని

అప్పుడు మేస్త్రీ గుండె పగిలిపోయింది

మొన్న తనగుండె మండే ఇంజను పొయ్యిలాగా అయిపోయింది

మేస్త్రీ అసమర్థుడు బలహీనుడు పిరికివాడు

తను ధైర్యం కలిగినవాడు శక్తిమంతుడు సామర్థ్యం వున్నవాడు

ఆ రోజు తను మేస్త్రిఇంటికిపోయేసరికి, మేస్త్రి భార్య హృదయంలో బొగ్గులకుంపటి రాజుకున్నట్లు కూర్చుంది మేస్త్రీ కూతురు బిక్కుబిక్కు మంటూ వాకిట్లో ఓప్రక్కగా నక్కింది

మేస్త్రి చిలపరపేసు తీసుకొని, అప్పుడే అలసిపోయి వచ్చిన తనని దుగ్గుదుగ్గుగా బొగ్గుని చితగ్గొట్టినట్లు చితగ్గొట్టాడు తను కిక్కురుమన లేదు "నా యింట్లోనించి పో భడవా" అన్నాడు మేస్త్రి ఆ రోజు తను తడబడుతున్న కాళ్ళతో వెనుదిరిగి చూచుకుంటూ వెళ్ళిపోయాడు

ఆ రోజు రాత్రి తను ఫ్యాక్టరీకి పోలేదు లోకోషెడ్డు చుట్టూఅదేపనిగా తిరిగాడు షెడ్డు ప్రక్కగా బొగ్గుగుట్ట దగ్గరగా మురికిగుంటలో కాళ్ళు పెట్టి బొగ్గుని చేత్తోగిల్లుతూ, మురికి గుంటలోనే ఈ దులాడే కన్యను చూస్తూ తను కూర్చున్నాడు

ఆ రోజే మేస్త్రీ వెనకగా వచ్చి, లేపి తీసుకుపోయి తనని ఇంట్లో నెట్టి ఎక్కడికో వెళ్ళిపోయి తెల్లవారింతరవాత వచ్చాడు మేస్త్రీ భార్య ఆరోజు రాత్రి బైటపడుకుంది ఆకాశంలో చంద్రుడున్నాడు భూమ్మీద వెన్నెలవుంది తనకు వంటినిండా దెబ్బలున్నాయి హృదయం నిండా వెన్నెలుంది

మేస్త్రీ శక్తిహీనుడు!

తను శక్తిగలవాడు

తనకు ఏమీ తెలియనీయకుండ ఇంత పనిచేసిన కోటిగాడ్ని తను క్షమించదలచుకోలేదు చంపివేయాలి అందుకె

బాబుతో ఆలోచించి, నిర్ణయించుకొని, వీడ్ని గూడ్సుబండి ఇంజను పొయ్యిలో మాడ్చివేశా ననుకున్నాడు డ్రైవరు గురవయ్య

ఇంజను టాపుమీద ఎవరో కదులుతున్నట్లు శబ్దం - నిశ్శబ్దంలో స్పష్టంగా వినవచ్చింది ఇదేదీ డ్రైవరుకు వినిపించదు ఫైర్‌మన్ ఇదేమీ పట్టించుకోలేదు

ఇంజను మూడుసార్లు కూత వేసి, ఒక చిన్నస్టేషను ప్లాటుఫారం దాటి వెళ్లిపోయింది

ఇంజను పొయ్యిలోంచి వాసనవస్తున్న జాడలేమీలేవు, పూర్తిగా వాసన ఆగిపోయింది ఏ పరమాణువు దొరక్కుండా ఇరవై సంవత్సరాలు పెరిగిన శరీరం ఒక్క గంటలో కాలి పోయింది

దూరంగావున్న నదిమీద బ్రిడ్జి మినుకు మినుకుమనే దీపాలతో నే నిక్కడున్నాను సుమా అని హెచ్చరిక చేస్తోంది

నది కాళ్ళుచేతులూ ఆరంజాచుకొని గాలికి కదులు తున్న చీరెను సరిచేసుకోకుండా నీటుగా నిద్రపోతోంది కాబోలు.

ఇంజను టాప్రమీద మనిషి జాగ్రత్తగా నడుస్తున్నట్లు శబ్దం వినవస్తోంది ఫైర్‌మన్ ఏమిటో అనుకున్నాడు ఇంజను నడుపుతున్నాడు

చీకటి చీల్చుకుంటూ గూడ్సుబండి నడుస్తోంది

గురవయ్య మామూలు స్థితికి వచ్చే ప్రయత్నంలో వున్నాడు

ఫైర్ మన్ గూడ్సుబండి డ్రైవ్ చేస్తున్నాడు డ్రైవర్ ఇంజను పొయ్యిలో బొగ్గు వేస్తున్నాడు ఆ పని అసలు చేయవలసింది ఫైర్ మన్

క్రిందవున్న బొగ్గుతీసి రెండుసార్లు పొయ్యిలోవేశాడు మూడోసారి తీయబోతూ ఆగిపోయాడు తీక్షణంగా బొగ్గు చిదుగులవైపు చూస్తూ వుండిపోయాడు

అలా ఎంతోసేపు చూడకుండ గురవయ్య వంగి ఏదో పైకితీసి, ఊది, పైనున్న చొక్కాతో తుడిచి జాగ్రత్తగా చూశాడు

పులిగోరు !

ఆ పులిగోరు తను బాబుకి రెండు సంవత్సరాలనాడు చేయించాడు అది ఇక్కడెందుకు పడింది? బాబు ఇంజనులోకి రాలేదు క్రిందవుండి అందించాడు బాబు మెడలోవుండే పులి గోరు ఎలా ఇంజనులోకి వచ్చింది ?

హత్య జరిగేటప్పుడు అనుకోకుండా బాబు మెడలోని పులిగోరు కోటిగాడి చేతిలోకి వచ్చివుంటుంది

ఇంజను టాపుమీంచి వచ్చే అలికిడి గురవయ్య విన్నాడు,

[illegible] వేగం పెంచుకొని సిగ్నల్ దాటి కళ్లుమూసుకొని పోతోంది గూడ్సు

ఇంజను టాపుమీంచి ఎవరో గుభిల్లున దూకారు

డ్రైవరు తల్ల యెత్తేసరికి ఇంజను డ్రైవ్ చేస్తున్న ఫైర్ మన్ గుండెల్లో కత్తి గుచ్చుకుపోయింది

దూరంగా నది బ్రిడ్జిమీద వెలుగుతున్న ముందు లైటుతో ఏదో రైలు వస్తోంది

ఒడ్డుల్ని ఢీకొంటూ మదించి ఘోషతో ప్రవహిస్తున్న నదిమీదికి గూడ్సు ఎక్కింది

కత్తిపిడి పట్టుకున్న పిడికిలి చూచి ముఖం చూశాడు డ్రైవరు

ఆశ్చర్యపోయాడు, భయపడ్డాడు నీరుగారి పోయాడు కత్తి పట్టుకొని ఎదురుగా కోటిగాడు నిలబడ్డాడు

ఏదో వెలుగు ఇద్దరి ముఖాలమీద పడింది

అంతలో కొండరాళ్ళు ఢీకొన్న సవ్వడి

వెలుగు ఆరిపోయింది అంతా చీకటి ఇనుం ఇంజన్లు విరిగిపోతున్న ధ్వని

నిశీధిని శంఖారావం పూరించింది

# తేలుకుట్టిన పాము

సూర్యుడు పడమట జారిపోయాడు చీకటి మెల్లగా చేతుల్ని భూమిమీద కప్పింది చీకటి పరిపాలన ప్రారంభం

లోతైనలోయ లోయకు రెండు ప్రక్కలా ఉన్నత మైన నల్లరాతి పర్వతాలు, ఆ పర్వతాలను కలుపుతూ రైలు బ్రిడ్జి క్రింద భయంకరమైన లోయ

చాలా దూరంలో కూతేసిన రైలు ముందులైటు బ్రిడ్జి మీదపడిన మరుక్షణంలోనే రైలు బ్రిడ్జీమీదకు వచ్చింది

బ్రిడ్జీచుట్టు చీకటి దట్టంగా క్రమ్మివుంది ఇంజన్ ముందు భాగంలో లైటు వెలుగుతోంది వెలుగు చీకటిని తరిమివేసింది వెంటాడింది దాటిపోయింది మరుక్షణంలో లోయపైన దట్ట మైన చీకటి

రైలు బ్రిడ్జీదాటి, కొండ శిఖరం విడిచిపెట్టి, ప్రక్క నున్న లోయలోనికి కొండను చుట్టుకొని మెలికలు తిరుగుతూ దిగుతోంది లోయచుట్టూ చెట్లు పెరిగాయి పుట్టమీదనించి ప్రక్కనున్న పచ్చిక తప్పుకుంటూ దిగిపోయే పాములాగా రైలు దిగిపోయింది

రైలు బోగీలు అన్నీ చీకటిగా వున్నాయి దాదాపు అన్నిపెట్టెలు నిశ్శబ్దంగా వున్నాయి ఒక్కచోట మాత్రం సన్నగా వెలుగు ఇంజను తరవాత మూడవ బోగీలో, మూడవ కంపార్టుమెంటులో లైటు

అది మొదటిక్లాసు కంపార్టుమెంటు తలుపుల్లో ఒకటి లాక్ చేసివుంది మరొకటి బోల్టుచేయబడింది

కంపార్టుమెంటులో రెండు లైట్లు వెలుగుతున్నాయి మూడు ఫానులు తిరుగుతున్నాయి ఉన్నవి మొత్తం ఆరు బెర్తులు పైనమూడు క్రిందమూడు పైన ఏదో సామా నుంది క్రింద ఎదురుగా రెండుబెర్తులు ప్రక్కగా ఒకబెర్తు, మరొకప్రక్క రెండు తలుపులకు త్రోవలు ప్రక్క బెర్తుమీద లెదర్ బేగ్, మరేవో వున్నాయి ఎదురు బెర్తుల్లో ఒకదాని మీద పుస్తకాలు, మరొకదానిమీద పడక

పుస్తకాల బెర్తు దాదాపు ఖాళీగావుంది ఉన్న చిన్న చిన్న పుస్తకాలు పత్రికలు ఫాను విసురిక మెల్ల మెల్లగా డ్యాన్సుచేస్తున్నాయి పడకమీద ఒక వ్యక్తి పడుకొనివున్నాడు ఆరోగ్యమైన శరీరం వ్యాయామంచేసిన దేహం

కంపార్టుమెంటు ఒక ప్రక్కగా బట్టలున్నాయి అవి కాకి బట్టలు వాటిక్రింద పెద్దసైజు బూటులున్నాయి

లెదర్ బేగ్ పైన ఒక బెల్టువుంది అలాంటి బెల్టు సాధా రణంగా అందరూ చూడలేరు అక్కడేమరొక్క హేట్వుంది చాలా ఖరీదైంది అంతకంటే విలువైంది హేట్ ముందు నొసటి పైనవుండే భాగంలో ఏదోప్రభుత్వం గుర్తువంటి ముద్ర వుంది దానికి రెండువైపుల ఏదో అలంకరణవుంది

వ్రేలాడుతున్న షర్టుకిముందు భాగంలో ఏవో మెడల్సు వున్నాయి వాటిపైన ఏవో రంగు రంగుల రిబ్బన్లున్నాయి రంగు దారాల కలయికలో ఏదో తాడు షర్టుకి కుడిచేతి

భుజందగ్గర చుట్టివుంది ఏవో అక్షరాలుకూడా భుజంపైన కుట్ట బడి వున్నాయి

ఆ వ్యక్తి నిద్రపోతున్నాడు పైన లైట్లు వెలుగు తున్నాయి ప్రక్కనే ఫానులు తిరుగుతున్నాయి

ఎదురుగావున్న బెర్తుమీద ఏవో పుస్తకాలు చెల్లా చెదురుగా పడివున్నాయి గాలికి నృత్యం చేస్తున్నాయి

లైట్లు వెలుగు తున్నాయి వెలుతురు ప్రసరిస్తున్నాయి

ఫానులు తిరుగుతున్నాయి గాలి ఒంచుతున్నాయి

ఎదురు బెర్తుమీద పుస్తకాలు ఎగిరి పడుతున్నాయి

ఏదో పత్రిక అట్టమీాగి బొమ్మ స్పష్టంగా కనబడుతోంది

ఒక స్త్రీ!

సన్నని బట్ట తడిసి శరీరానికి అతుక్కుపోయింది వెంట్రు కలు పిరుదురు దాటివున్నాయి శరీరమంతా తడిసివుంది చంకలో నీరు వాలికిపోయే బిందె

వెనుకగా రెండుకొండలు కొండలుమధ్యగా సెలయేరు సెలయేరు ప్రవహించిన ప్రదేశంలో పచ్చనిగరిక, పచ్చగరిక మీాద ఒక కాలు సెలయేటిలో మరొక్కకాలు చూపులు ఏదో పశువుమీాద

కిటికీ ఒకటి తీసివుంది బయటనించి గాలి బలంగా వీచింది దానికితోడు ఫానులు తిరుగుతున్నాయి గాలి ముమ్మరంగా వస్తూవుంది పత్రిక పడిపోయింది

మరొక్కపత్రిక మరొక్కబొమ్మ

లైట్లు వెలుగుతున్నాయి

ఫానులు తిరుగుతున్నాయి

కిటికీలోంచి గాలి వస్తూనేవుంది

ఒక యువతి, మరొక యువకుడు యువకుడు పట్టలేని తమకంలో యువతిని ఎత్తుకొని ముద్దుపెట్టుకుంటున్నాడు ఆమె అతన్ని గుండెలవైపు ఒత్తుకొంటోంది

యువతి నడుం వంగిపోయింది యువకుడు ముందుకు తూగిపోయాడు

యువకుని చేతులు యువతి తలనలిపేస్తున్నాయి యువతి చేతులు యువకుని వీపు ఎండేస్తున్నాయి

బుస్సున కిటికీలోంచి గాలి కంపార్టు మెంటులోకివచ్చింది టప్పున పత్రిక రేచి క్రిందపడింది

బెర్తుక్రింద ఎడిపోయిన పత్రిక ఒక బౌండు పుస్తకం అట్ట తొలగించి మరీ ఎగిపోయింది

లైట్లు వెలుగుతూనే వున్నాయి

కిటికీలోంచి గాలి రావటంలేదు

ఫానుగాలికి బౌండు పుస్తకం పేజీలు ఫెటఫెటా కొట్టుకుంటున్నాయి

ఏ పేజీకూడా పూర్తిగా కనిపించటంలేదు కాగితాలు లేస్తూపడుతూవున్నాయి ఒక పేజీలో ఒక బొమ్మవుంది బొమ్మక్రింద ఏవో నాలుగుమాటలు వ్రాసివున్నాయి బహుశా అది వివరణ కావచ్చు ఆభాష ఏదో తెలియటేదు

ఒకబొమ్మ కనిపించింది స్పష్టంగా కనపడక ముందే ఫాన్‌గాలికి కాగితం తిరిగిపోయింది లీలగా ఆ బొమ్మగుర్తుంది ఏదో ప్రత్యేకత ఆ బొమ్మకుంది ఏదో ప్రపంచ జన్మానికి

సంబంధించిన బొమ్మ అదే కావచ్చు! చెడ్డబొమ్మ వయస్సులోవున్న స్త్రీ పురుషుల బొమ్మ ఒక భంగిమ

కిటికీలోంచి పెద్దపెట్టున గాలి తోలింది బొండు పుస్తకం అట్ట టప్‌న లేచిపడింది ఫాన్‌గాలికి మళ్ళీ అట్ట లేచి రేగు

పడకమీద వ్యక్తి రాత్రి వస్త్రాల్లో వున్నాడు కొంచెం కదిలాడు చేతులుచాచి కాళ్ళదగ్గర దుప్పటి ముఖంవరకు లాక్కున్నాడు

బైటిగాలి కిటికీలోంచి సన్నగా వస్తుంది
ఫానులు మామూలుగా తిరుగుతున్నాయి
లైటు నిద్రమగతగా వెలుగుతోంది
అతను నిద్రలోంచి లేచాడు

కళ్ళు తెరిచాడు మరుక్షణంలో మూసుకున్నాడు ప్రక్కకు తిరిగాడు చేయి ముఖందగ్గరకు తెచ్చుకున్నాడు, కళ్లు తెరిచాడు చేతిగడియారం చూచుకున్నాడు కిటికీవైపు చూశాడు తీసివుంది లేచాడు కిటకీ మూశాడు తలుపు దగ్గరకుపోయాడు లాగి చూశాడు వేసివుంది గదంతా కలయ జూశాడు బాత్‌రూంలోకి పోయాడు లైటువేసి వచ్చాడు బెస్తుమీదచూశాడు పడకమీద పిస్టలుంది పైకితీసి చూశాడు తాళం వేసివుంది తలగడక్రింద పెట్టుకున్నాడు పడుకున్నాడు దుప్పటి కప్పుకున్నాడు

కొద్ది సెకండ్లకాలం గడిచిపోయింది

దుప్పటి తొలగించివేశాడు కిటకీవైపు చూశాడు తలుపువైపు చూశాడు పిస్టలువైపు చూశాడు దుప్పటి కప్పుకున్నాడు

కొంచెంసేపు గడిచిపోయింది

పక్కమీద అటూఇటూ దొర్లాడు నిద్రపట్టలేదు దుప్పటి తొలగించి పడుకున్నాడు నిద్ర పట్టలేదు ముసుగు దీసుకొని మోకాళ్ళలో తలజేర్చి పడుకున్నాడు నిద్రపట్టలేదు ప్రక్కకు తిరిగి పడుకున్నాడు బోర్లపడుకున్నాడు వెల్లకిలగా పడుకున్నాడు, నిద్రపట్టలేదు లైటార్పాడు ముఖానికి ముసుగు పెట్టుకున్నాడు నిద్రపట్టలేదు

దుప్పటి దూరంగా పారేశాడు లైటువేశాడు లేచి కూర్చున్నాడు

మళ్ళీ ప్రయత్నించాడు పడుకున్నాడు మరొక్క ప్రక్కకు తిరిగాడు ఇంకొక్క ప్రక్కకు తిరిగాడు వేరొక ప్రక్కకు తిరిగాడు నిద్రపట్టలేదు

లేచాడు

ఎదురుబెస్తుమీద కూర్చున్నాడు అక్కడేవో పత్రికలూ—పుస్తకాలూ చూశాడు తీసుకున్నాడు విడచిపెట్టాడు మూలకు తలజేర్చి కళ్లు మూసుకున్నాడు నిద్రపట్టలేదు

నిద్రపట్టలేదు, తృప్తికలగలేదు బాధ అతని ముఖంలో లేదు విసుగుదలలేదు నిజానికి ఎంతో దీక్షగా ఉపవసించిన్వాడే కాని అలసట లేదు ఏదో మధురమైన అనుభూతి కలిగినట్లు ఏదో విచిత్రమైన విధివిధానం జరుగుతున్నట్లు ఏదో బలవత్తరమైన ఆనందంయొక్క అగ్రగామి అనుభవం ముఖంలో కనిపిస్తోంది

ఎదురుబెస్తుమీద కొన్ని క్రింద కొన్ని పుస్తకాలూ, పత్రికలూ వున్నాయి ఏవో పత్రికలు చూశాడు ఏవో పుస్త

